# కళాహము

[ నాటకం ]

రచన:

విశ్వప్రసాద్

కళాప్రచురణలు,

నంద్యాల.

## నా మాట

ఈ నాటకం 1953 సం॥లో "అంజలి" మాస పత్రికలో "కళ" అను పేరుతో సీరియల్‌గా ప్రచురింప బడింది. తర్వాత ప్రదర్శనకోసమని, అక్కడక్కడ కొన్ని కొన్ని మార్పులు చేసి పేరు మార్చేను.

ఇదే నా మొదటి నాటకం. అయినా, అనేక విధాల ప్రోత్సహించి, సహకరించిన మిత్రులకు 'అంజలి' సంపాదకులకు నా ధన్యవాదాలు.

విశ్వప్రసాద్

# పాత్రలు

కళామయి : విశ్వనాథం గారి కూతురు, కళోపాసి.

వయస్సు 18 సం॥

విశ్వనాథం : కళామయి తండ్రి, కళారాధకుడు.

వయస్సు 45 సం॥

చంద్రం : విశ్వనాథం గారి మేనల్లుడు, రచయిత.

వయస్సు 24 సం॥

రాజారావు : కళామయి ప్రియుడు.

వయస్సు 24 సం॥

రామన్న ; విశ్వనాథం గారి నౌకరు.

వయస్సు 45 సం॥

గోకులదాసు : సినిమా డైరెక్టరు.

వయస్సు 30 సం॥

అవతారం : అసిస్టెంటు డైరెక్టరు.

వయస్సు 26 సం॥

రత్నం : ప్రొడ్యూసరు.

వయస్సు 40 సం॥

# క ళా మ యి

## మొదటి దృశ్యం.

[ స్థలం: విశ్వనాధంగారి భవనానికి క్రింది భాగంలో పెద్దగది.

విశ్వనాధంగారు కళోపాసకులు కనుక, గదిలో ఎక్కడ చూసినా, రకరకాల సినిమా నటీనటుల ఫొటోలు, అజంతా చిత్రాలు చక్కగా అమర్చబడి వుంటాయి. గది మధ్యలో ఒక సోఫా, దానికి ఒక వైపున టేబుల్, మరొక వైపున రెండు కుర్చీలు వుంటాయి. టేబుల్ మీద సిల్కుగుడ్డ, రేడియో, అలారం టైముపీసు, పూలకూజా, కొన్ని పుస్తకాలు వుంటాయి.

రాత్రి సమయం: పదిగంటలయింది.

విశ్వనాధంగారి యింటి నౌకరు రామన్న గదిలోని సామాన్లు సర్దుతూ, చిరునవ్వు ముఖంతో, చిన్నగా పాడుతుంటాడు. ]

రామన్న: [ పాట ]

చిత్రం! విచిత్రం! చిత్రవిచిత్రం!
ఈలోకం! సినిమా లోకం!! ॥చి॥
నిజాన్నంత కప్పిపుచ్చి,
మజామజా కళ్ళకిచ్చి;
నల్ల నల్లని రూపాలను,
తెల్ల తెల్లని రూకలతో;
తళ తళా, నిగ నిగా,
మెరిపించే, మురిపించే,
చిత్రం! విచిత్రం! చిత్రవిచిత్రం!!
ఈలోకం! సినిమా లోకం!! ॥చి॥

బలె బలేగుంది రాత్రిరి సినిమా! అందులో ఆ బాబుల దర్జా, ఆ యమ్మల సోకులు, ఓయబ్బో! చెప్పడానికి వీలా! ఆటలు, పాటలు, విందులు, విహారాలు—ఒకటేంటి? —పెద్ద కోటీశ్వరుల్లా గున్నారు. (చిరునవ్వుతో) నేనుకూడ సినిమా కంపెనీలో కెళ్ళిపోతే, బలే దర్జాగుంటుంది. కావలసినంత డబ్బిస్తారట! నాకే గనక అఛాన్సు దొరికిందా, యింక చూసుకో ఈ రామన్న మజా! ఛీ! రామన్నేంటి? 'రామరాజు' అనమంటాను. ముందొక మంచి పిల్లను పెళ్ళాడతాను. అతర్వాత...ఒక మోటారు కొనేస్తాను. (ఆలోచిస్తూ) ఆతర్వాత...ఊc! తర్వాత పెద్దమేడ కట్టేస్తాను. యింక చూసుకో, నారాజా! రామరాజంటే అందరకు ఔల్లమై పోతాడు. (భుజాలెగరేసి) అc! రాత్రిరి చూసిన సినిమా యేంటి?...అc... (తల గోక్కుంటూ అటు యిటు తిరుగుతూ) ఛీ! వెధవ బుర్ర! (నెత్తిమీద కొట్టుకుని) రాత్రిరి చూసిన సినిమాయే మర్చిపోయింది. పైగా సినిమాల్లో చేరతానంటుంది. వెధవ బుర్రకు బుద్ధంటూ లేదు.

[ఇంతలో విశ్వనాధంగారు వస్తారు. ఆయన్ని చూసి రామన్న కంగారుగా సామాన్లు సర్దుతూ టేబుల్ మీదనున్న పుస్తకాలు క్రింద పారేస్తాడు.]

విశ్వ : రామన్నా!

రామ : బాబూ!

విశ్వ : ఏమిటోయ్....?

రామ : (కంగారుగా) ఏం లేదు బాబూ!

విశ్వ : ఎందుకా కంగారు?

రామ : అ...అ... ఏంలేదు బాబు! పుస్తకాలు...

విశ్వ : సర్దుతున్నానంటావ్!

రామ : అవును బాబు!

విశ్వ : భేష్! భేష్! పగలంతా ఏం చేస్తున్నావ్?

రామ : బజారు కెళ్ళమన్నారు బాబూ.

విశ్వ : ఎవరు? నేనా?

రామ : అమ్మాయిగారు.

విశ్వ : (చల్లబడి) అలాగా! అమ్మాయిగారి ఆజ్ఞకు అడ్డులేదు. వెళ్ళావా?

రామ : వెళ్ళాను బాబు.

విశ్వ : ఏం తెచ్చావ్? నాకు చూపించనే లేదే!

రామ : ఏవో సామాన్లు...

విశ్వ : ఏం సామాన్లో అవి?

రామ : ఏమో బాబు! అమ్మాయిగారు చీటీ రాసిచ్చారు; ఫేన్సీ స్టోరులో ఆ చీటీ చూపించగానే, ఏవో సామాన్లు అట్ట పెట్టిలో కట్టిచ్చారు.

విశ్వ : సరి సరి! నిన్నూ దానిలో పెట్టి కట్టలేదు. కాని, ఈ మాటలన్నీ నాదగ్గల పనికిరావు. ఏమైనాసరే, మన గది ఎప్పుడు చూసినా కళకళ లాడుతూ వుండాలి.

రామ : నాకు తెలియదా బాబూ?

విశ్వ : ఆ పుస్తకాలు సరిగ్గా సర్దు.

[ రామన్న సర్దుతాడు ]

కొంచెం కాఫీ తీసుకురా.

[ రామన్న లోపల కెళతాడు. విశ్వనాథంగారు సోఫాలో కూర్చుని, పేపరు చదువుతుంటాడు. రామన్న గాజు గ్లాసుతో మంచి నీళ్లు తెస్తాడు. ]

విశ్వ : కాఫీ లేదూ?

రామ : అయిపోయింది బాబు.

విశ్వ : ఏమయిందోయ్?

రామ : అమ్మాయిగారు, రాజారావుగారు కలిసి తాగేశారను కుంటాను...

విశ్వ : రాజారావెవరు?

రామ : అమ్మాయిగారి స్నేహితులు.

విశ్వ : ఎప్పుడొచ్చాడు?

రామ : మీరు లేనప్పుడు తరచు వస్తుంటారు.

విశ్వ : వున్నప్పుడు రాడు. అంతేనా? (మంచినీళ్లు త్రాగుతూ) ఏం నన్ను చూస్తే భయమా?

రామ : ఏమో బాబు.

విశ్వ : ఊఁ— కళ వచ్చిందా?

రామ : రాలేదు బాబు! ఇవ్వాళ నాట్యముందట!

విశ్వ : (ఆప్యాయంగా) ఎక్కడ?

రామ : "జానకీ కళామందిరం" లో......

విశ్వ : (మధ్యలో) రామన్నా! మన కళ నాట్యం బాగా చేస్తుంది కదూ!

రామ : అమ్మాయిగారి నాట్యం గురించి వేరే చెప్పాలా బాబు! నాట్యం చూడ్డాని కెంతోమంది వస్తుంటారు. చూసి నోళ్లు చూసి నట్టుండక, యింటికి కూడ వచ్చి పొగడుతుంటా రెందుకు బాబూ?

విశ్వ : అదొక రకమైన మర్యాదలే—మర్యాద!

రామ : గంటల తరబడి పొగడుతుండడం మర్యాదా?

విశ్వ : పోనీ— జబ్బనుకో.

రామ : జబ్బా?

విశ్వ : ఔను. ఒక గొప్ప వ్యక్తిని రక్తిగా పొగడు తుండడం తక్కువ వాళ్ళలో వుండే పెద్ద జబ్బు. ఆ జబ్బు మూలంగా కొంతమంది డబ్బునుకూడ సంపాదిస్తుంటారు.

రామ : బాగుంది!

విశ్వ : సరే కాని, కళ ఏమైనా చెప్పిందా?

రామ : ఇవ్వాళ నాట్యానికి మంచి-మంచి ఏర్పాట్లు చేశారట!— తప్పకుండా రమ్మన్నారు.

విశ్వ : వెళదా మంటావా?

రామ : అదేంటి బాబూ, అలా అడుగుతున్నారు?

విశ్వ : అహఁ! వెళదామా అని?

రామ : మీ యిష్టం.

విశ్వ : నీ వుద్దేశం చెప్పవోయ్.

రామ : వెళదాం బాబు!

విశ్వ : అదే కావలసింది. నీకు కళంటే ఎంత అభిమానమో అని......

రామ : అడిగేరా?

విశ్వ : అడగడం కాదు—పరీక్షోయ్! పరీక్ష!

రామ : ఈ పరీక్ష రోజూ చేసేదేగా బాబు! అదీగాక, యిన్నాళ్ళ నుంచి మీ దగ్గరుంటుంటే, ఆ మాత్రం......

విశ్వ : గాలి సోకకుండా వుంటుందా అంటావ్! భేష్! భేష్! అలాగే వుండాలి. మన యింట్లో వుండే మనుషులు, వస్తువులు—అన్నీ కళతో నిండి పోవాలి.

రామ : చిత్తం!

విశ్వ : టైమవుతూ వుంది. కండువా తీసుకురా వెళదాం.

[ రామన్న లోపల కెళతాడు. చంద్రం వస్తాడు. ]

చంద్రం : మామగా రెక్కడికో ప్రయాణ మవుతున్నారనుకుంటాను?

విశ్వ : (కళ్ళజోడు సవరించుకొని) ఎవరు? చంద్రం! రావోయ్! ఇదే రావడమా? వస్తున్నట్టు కబురైనా చెయ్యలేదు! (గట్టిగా) రామన్నా! రామన్నా!

[ రామన్న కండువాతో వస్తాడు. ]

చూడు, మన చంద్రం వచ్చాడు.

రామ : చంద్రం బాబుగారా. కులాసాగా వున్నారా బాబూ? (కుర్చీ సరిచేస్తూ) కూర్చోండి.

చంద్రం : (కూర్చుంటూ) ఆఁ కులాసాగానే వున్నాను.

విశ్వ : ఇంటి దగ్గర నుండేనా రావడం?

చంద్రం : అబ్బే! ఇల్లు విడిచిపెట్టి రెండు నెలలయింది.......

విశ్వ : అదే కావలసింది. ఆడది తిరిగి చెడిందట! మగవాడు తిరక్క చెడ్డాడట! నువ్వు యింట్లో కూర్చుని కాగితాలు ఖరాబు చెయ్యకుండా, కాస్త నలుగురితో తిరగడానికి ప్రయత్నిస్తున్నావ్. చాలా సంతోషం.

రామ : (చంద్రంతో) అయితే, ఇప్పుడెక్కడుంటున్నారు బాబూ?

చంద్రం : ఇక్కడే!

విశ్వ : ఈ వూళ్లోనేనా?

చంద్రం : ఔను.

విశ్వ : వూళ్లో వుంటే మన యింటికి రాలేదేం?

రామ : అత్తారింటికి వస్తే.....

విశ్వ : మత్తుమందు జల్లుతారంటావా?

రామ : లోకు వంటారు బాబు!

విశ్వ : ఓహో! అంతేనా చంద్రం?

చంద్రం : ఏదో, ఆపని—ఈపని వుండడంవల్ల రాలేకపోయాను.

విశ్వ : అవునవును. ఈ మధ్య కలానికి ఎక్కువగా పని

చెబుతున్నావట కదూ! అందుకు తీరుబడి వుండక పోవచ్చు.

చంద్రం : ఎవరు చెప్పారు?

విశ్వ : కళ చెప్పిందిలే.

చంద్రం : ఏమని?

విశ్వ : ఏవో సినిమాలకు కథలు రాస్తున్నావట కదూ!

చంద్రం : ఏదో లెండి.

విశ్వ : ఏదో లెండి అంటూ యిందులో కూడ మొహమాట మెందుకోయ్? వున్నమాట చెప్పు.

రామ : చంద్రం బాబూ! మీ కవిత్వం నాకు కొంచెం విని పించాలి.

విశ్వ : 'నాకూ' ఏమిటోయ్? - 'మాకూ' అను.

చంద్రం : (నిరసనగా) ఆఁ ఏమి కవిత్వం లెండి. ఈ రోజుల్లో అసలు కవిత్వాలు-కళలు వింపని కొస్తాయి?

రామ : అదేంటి బాబు! అలా అంటారు?

చంద్రం : అవును రామన్న! ఈ రోజుల్లో కావలసింది అసలు కవిత్వాలు-కళలు కావు — డబ్బు! డబ్బున్న వాడే కవి, డబ్బున్నవాడే కళారాధకుడు. ఏది చూసినా డబ్బులోవుంది, ఎవరికి కావలసిన డబ్బే! ప్రపంచ మంతా 'డబ్బు-డబ్బు' అనిఆకాశం బ్రద్దలయ్యేటట్లు అరుస్తూవుంది.

రామ : నిజమే బాబు! లోకమే డబ్బులో వుంది.

విశ్వ. : 'లోకమే డబ్బు, డబ్బే లోకం' అను, సరిపోతుంది.

రామ : అంతే బాబు! ఈ లోకంలో వుండే-డబ్బున్న వాళ్ళకీ, డబ్బులేని వాళ్ళకీ, బతికేవాళ్ళకీ, ఆఖరికి చచ్చే వాళ్ళకీ-అందరికీ డబ్బే కావాలి.

చంద్రం : నిజం! డబ్బున్నవాడే ఈ లోకంలో నాలుగు రోజుల పాటు హాయిగా బ్రతకగలడు......

విశ్వ : అంతేనోయ్! అంతే! డబ్బంటేఏమిటి?-ఒక పెద్దజబ్బు. మామూలు జబ్బులు అప్పుడప్పుడు మనిషిని చంప వచ్చు. కాని డబ్బు జబ్బు పట్టుకున్న మనిషి చావును చంపేస్తాడు.

చంద్రం : అందుకు నే నొప్పుకుంటాను.

విశ్వ : అదే కావలసింది.

రామ : కాని, డబ్బులేనోళ్ళు మాత్రం సుఖంగా బతకడం లేదా బాబూ?

చంద్రం : ఎలాంటి వాళ్ళు?

రామ : చదువుకున్న వాళ్ళు.

విశ్వ : చదువుకున్న వాళ్ళకంటె, సన్యాసులే నయమోయ్!- ఏగొడవలేకుండా, కాలుమీద కాలేసుకుని మంతంలో కూర్చుంటారు. కాని, చదువుకున్న వాళ్ళని రక రకాలబాధలు, గొడవలు, కష్టాలు, నష్టాలు-ఎప్పుడూ పీడిస్తూనే వుంటాయ్.

రామ : పోనీ, కవులు - కళారాధకులు హాయిగా బతకడం లేదంటారా?

చంద్రం : లేదు రామన్న! దూరపు కొండలు నునుపన్నట్లు, వాళ్ళ జీవితాలు చూసేవాళ్ళకు హాయిగా వున్నట్లే కనిపిస్తాయ్. కాని, ఆర్థికలోపం వల్ల అణు మాత్రమైనా సుఖాన్ని పొందలేక పోతున్నారు.

విశ్వ : అంతేనోయ్! అంతే! కళకోసం పాటుపడేవాళ్ళ కడుపులు ఎప్పుడు చూసినా మడతకుడుముల్లాగ ముడుచుకుపోయి వుంటాయి.

చంద్రం : ఆ ఆకలి బాధను నివారించుకోడానికే తమలోని కవిత్వాన్ని, కళల్ని బజారులో పెట్టి అమ్ముతున్నారు.

రామ : కవిత్వాన్ని - కళల్నికూడ అమ్ముకొంటారా బాబూ?

చంద్రం : అదే అందరు గమనించవలసిన విషయం. కళల్ని - కవిత్వాన్ని అమ్ముకొంటారా? అని చాలామంది అనుకొంటారు. కాని, యిందులో వున్న సత్యాసత్యాలు ఆ కవులకు కళోపాసకులకు తప్ప యితరు లెవరికీ తెలియవు. వారు యితరులతో ఎప్పుడూ చెప్పుకోరు.

విశ్వ : భేష్! అలాగే వుండాలి. తిన్నా తినక పోయినా సలుగురిలోకి వచ్చేసరికి 'బేష్' అనాలి.

చంద్రం : ఇప్పటి కళోపాసకులు చేసేపనే అది.

రామ : కవులు-కళారాధకులు కూడపారపాట్లు చేస్తారా బాబూ?

చంద్రం : నిజమే రామన్నా! నువ్వు చెప్పినట్లు సినిమాల్లో పని చేసే వాళ్ళకు డబ్బుకు, పేరుకు లోటుండదు. అయితే ,అందరకూ మాత్రంకాదు. కొందరికే డబ్బు, కీర్తి, పేరు, ప్రతిష్ఠ—అన్నీవుంటాయ్.

విశ్వ : మిగిలిన వాళ్ళకు?

చంద్రం : పదిసార్లు కాళ్ళు అరిగేటట్లు తిరగడం, దగ్గరున్న డబ్బు ఖర్చు చేసుకోడం, ఆఖరికి అన్నివిధాల చెడిపోడం కూడ జరుగుతుంది.

విశ్వ : అదే కావలసింది. కళంటే కల్ల కాదు, కళంటే, పవిత్ర అనుభూతి. జీవితానికి సంబంధించిన పాఠ్య గ్రంథం. బెల్లాన్ని చుట్టుకున్నట్టు అందరూ దాన్నే చుట్టుకొంటే?- లాభం లేదు. దానికీ కొంచెంపెట్టి పుట్టాలి.

చంద్రం : పెట్టి పుట్టడంకంటే, ఈరోజుల్లో పెట్టుబడికే ఎక్కువ విలువ కన్పిస్తున్నది.

రామ : ఇంతకూ మీరురాసినకథకు ఏమైనా వచ్చిందాబాబూ?

చంద్రం : అదొక నల్ల బజారుతే.

విశ్వ : అంటే?

చంద్రం : మొదట ఒక ప్రొడ్యూసరుకు నా కథ చూపించాను. నా పేరు లేకుండా కథ వారి కిచ్చేస్తే రెండువేలిస్తా మన్నారు......

రామ : లేక పోతే?

చంద్రం : వెయ్యి రూపాయి లిస్తామన్నారు.

రామ : పేరు కోసం వెయ్యి రూపాయిలు తగ్గించడమా?

విశ్వ : బాగుంది! బాగుంది. అసలు కంటే వడ్డీ ఎక్కువై పోయింది. రాసిన వాళ్ళ పేరూ-పూరూ లేకుండా, డబ్బిచ్చి కొనుక్కోడం! వాళ్ళపేరు పెట్టుకోడం! చాలా బాగుంది!

చంద్రం : ఇదొక రకమైన వ్యాపారం.

విశ్వ : పేరు సంపాదించడానికి పెద్ద సోపానం.

చంద్రం : సినిమా లోకంలో వుండే రహస్యమే అది, కష్టపడి పని చేసేదొకరు......

విశ్వ : పుష్టిగా భోజనం చేసేది వేరొకరు. అంతేనా? ప్రపంచమే అంతలే!

రామ : మరి,... మీ కథ ఏంచేశారు బాబూ?

చంద్రం : మరొక ప్రొడ్యూసరు దగ్గరికి తీసుకెళ్ళాను. అతను మాట్లాడకుండా రెండువేలిచ్చి తీసుకున్నాడు.

రామ : మన బంగారం బాగుంటే, ఎక్కడ కెళ్ళినా ధర వస్తుంది బాబు!

విశ్వ : బంగారం బాగున్నా లాభం లేదోయ్! దానికి రంగు పూసి, సింగారం చేసి చూపించాలి. సింగారం!

చంద్రం : నిజం! మీరు చెప్పినట్లు, పైపై మెరుగులు, నాలుగు

కబుర్లు, చేతిలో రెండు డబ్బులు వున్నవాళ్ళే ఈ కాలంలో బ్రతకగలరు.

విశ్వ : అంతేనోయ్! ంతే.

రామ : కండువా తెచ్చాను బాబూ!

విశ్వ : సరి సరి! మర్చి పోయాను. (కండువా తీసుకుని) చంద్రం! లే!

చంద్రం : ఎక్కడికి?

విశ్వ : జానకీ కళామందిరంలో మన కళ నాట్యముంది. చూసి వద్దాం. రా.

చంద్రం : మీరు వెళ్ళిరండి.

విశ్వ : నువ్వూరా. ఇక్కడ కూర్చుని మాత్రం ఏం చేస్తావ్? (రామన్నతో) డ్రైవర్ని కారు తెమ్మను.

చంద్రం : (లేస్తూ) ఇప్పుడు కారెందుకు? చల్లగా వుంటుంది...

విశ్వ : మెల్లగా నడచి పోదామంటావా? (లేస్తూ) అయితే పద. రామన్నా, నువ్వు తలుపులు జాగ్రత్తగా వేసి రావోయ్.

రామ : అలాగే బాబు!

[విశ్వనాథంగారు, చంద్రం వెళ్ళిపోతారు.]

రామ : (తల గోక్కుంటూ) సినిమాల్లో పనిచేసే వాళ్ళకు కావలసినంత డబ్బిస్తారని అంతా అనుకుంటారు. కాని, ఈ బాబుచూస్తే, సినిమా వాళ్ళదంతా మోసం

దగా అంటాడు. ఇందులో ఏది నిజం? (సర్దుకొని) ఏదెలావుంటే నాకేం? నాకు ఛాన్సు దొరికిందంటే, తప్పకుండా వెళతాను. నన్ను మోసం చేసేవాళ్ళెవరు? మోసం చెయ్యాలనుకున్నా నా దగ్గరేముంది? (ఆగి) ఏమైనా సరే, ఎలాగైనాసరే, సినిమాల్లో చేరి, అందులో వుండే బాబుల్లాగ ఒక్కసారి ఆడి, పాడి తర్వాత చచ్చిపోయినా ఫరవాలేదు.

[ "చిత్రం! విచిత్రం!! చిత్ర విచిత్రం!!!" అనే మొదటిపాటనే పాడుకుంటూ వెళుతుండగా—

తెర]



# కళామయి

## రెండవ దృశ్యం.

[స్థలం : "జానకీ కళామందిరం"లో ఒక ప్రత్యేక గది. గదంతా నటీనటుల ఫొటోలతో అందంగా అమర్చబడి వుంటుంది. రెండు మూడు కుర్చీలు, అందమైన కొన్ని సామాన్లు వుంటాయి.

రాత్రి సమయం : రెండు గంటలయింది.

కళామయి ఒక అద్దం ముందు నిలబడి, "మేకప్" తుడుచుకుంటూ పాడుతుంటుంది.]

కళ :

[పాట]

నా మధుర హృదయమా!
కమనీయ కళాలయమా!
అందుకో నా దివ్యగీతావళి!
ఆనంద భవితవ్య భావావళి! ॥నా

పసిడి పంటల పరమానందము,
వెన్నెలలోని కాంతుల అందము,
మిసమిసలాడే యౌవన మదము,
కులుకుచు నుండే ప్రణయగానము ॥నా॥

అధర స్పర్శలో మధుర ముంది,
ప్రణయ శోభలో ప్రకృతివుంది;
ప్రేమ పిలుపుకే ముదము జెంది,
విధిగా తుది సుధాంబుధి పొంది___ ॥నా॥

[అంతవరకు చాటునున్న రాజారావు అకస్మాత్తుగా వచ్చి, కళామయి కళ్ళు మూస్తాడు. కళామయి రాజారావు చేతినున్న వాచీ పట్టుకొని "రాజా!" అంటుంది. రాజా మాట్లాడకుండా లోలోన నవ్వుతుంటాడు. వెంటనే కళ రాజా చేతుల్ని విదలించుకుని దూరంగా వెళ్ళి నిలబడుతుంది.]

రాజా : ఏం కళా!

కళ : (తమాయించుకుంటూ) అబ్బ! భయమేసిందండీ!

రాజా : అభయ మిమ్మంటావా?

కళ : పేరుపెట్టి పిలిచినా మాట్లాడరేం?

రాజా : నిజంగా మాట్లాడితే మజా ఏముంది?

కళ : చాల్లెండి గుండె 'గుభేలు' మంది.

రాజా : అందుకే, అభయ మిస్తానన్నానుగా! అయినా, ఏదీ కొంచెం చూద్దాం, ఎంతవేగంగా కొట్టుకుంటున్నదో! (అంటూ కళ దగ్గరకు వెళుతుంటాడు,)

కళ : వద్దులెండి. ఇప్పుడు సర్దుకుంది.

రాజా : పూర్తిగా!

కళ : ఆహాఁ!

రాజా : అయితే, మరి, నీ యిష్టం.

కళ : మీరు కష్టం అనుకోకుండా ఆ కుర్చీలో కూర్చోండి.

రాజా : తమరేం చేస్తారు?

కళ : మేకప్ తుడుచుకోవడం అయిపోయింది. జడ అల్లుకుంటాను.

రాజా : వూరకే కూర్చోమంటావా?

కళ : వూరకే ఎందుకు? సిగరెట్టు వుంటే, కాల్చుకుంటూ, పొగ విడుచుకుంటూ, చక్రాలు వదులుకుంటూ కూర్చోండి.

రాజా : (కుర్చీ మీద కూర్చుని. సిగరెట్టు అంటిస్తూ) సిగరెట్టు వల్ల ఎక్కువ నిషా కలగదు.

కళ : పోని, హుషారు చేసే కషాయమేదైనా వుంటే త్రాగండి.

రాజా : ఆ కషాయంకంటే, నిషానుకలిగించే మనిషివి నువ్వు.

కళ : ఇంకా నయం— విషమన్నారు కాదు.

రాజా : విషమా?

కళ : మరి...?

రాజా : కాదు కళా! నువ్వు పీయూషానివి- అంటె అమృతానివి.

కళ : అయితే, ఆకుర్చీలోనే జాగ్రత్తగా కూర్చుని నేను జడ అల్లుకునే వరకు ఆస్వాదిస్తుండండి.

రాజా : అంతేనా?

కళ : ఇంకేం కావాలి?

రాజా : ఒక్క పాటపాడు. ఆలకిస్తుంటాను.

కళ : ఇప్పుడేగా పాడేను!

రాజా : ఇందాక స్టేజిమీద పాడేవ్! కాని, యిది ప్రత్యేక ప్రోగ్రాం.

కళ : అంటే?

రాజా : ఇందులో యిద్దరికే స్థానంవుంది.

కళ : ఎవరెవరికి?

రాజా : పాడేవారికి, వినేవారికి. అంతే.

కళ : మీ మాటల్లో స్వార్థం ధ్వనిస్తున్నది. కాని, కళ స్వతంత్ర జీవి.

రాజా : కావచ్చు.

కళ : కళ మీ కోసం, నా కోసం కాదు—ప్రజల కోసం.

రాజా : ఊం...

కళ : అది ఎప్పుడూ స్వేచ్ఛగా వుండాలి.

రాజా : లేక పోతే?

కళ : లేకపోతే కళ వికసించదు, పరిమళించదు.

రాజా : కళా! నువ్వు ఏం మాట్లాడినా రత్నాలు రాలుతున్నట్లుం టుంది.

కళ : ముత్యాలు కురుస్తున్నట్లుండదు?......

రాజా : నీ కిన్నెర కంఠంతో పాడుతుంటే, పువ్వులు విక సిస్తాయ్......

కళ : ఇంకా నయం! గవ్వలు గలగల మనవు?

రాజా : నిజం కళా! నీ పాటకు గవ్వలు గలగల ధ్వనిస్తాయ్... నీమాటలకు మువ్వలు కిలకిల నాట్యం చేస్తాయ్...... పువ్వులు వికసిస్తాయ్...నవ్వులు కురుస్తాయ్...

కళ : ఇన్నింటికీ మధ్యలో రాజావారి శరీరం రివ్వున ఎగురుతూ వుంటుంది.

రాజా : నిజం!

కళ : ఆహా! యిహ చాల్లెండి.

రాజా : ఇంతకూ పాడవన్న మాట!

కళ : రాజావారి ఆజ్ఞ! పాడకపోతే వూరుకుంటారు? (ఆగి) అం
యిందాకటి పాటేకదూ! (రాజా తల వూపుతాడు.)

[ కళ నాట్యం చేస్తూ పాడుతుంది.]

[పాట]

కళ : కళామయం — జీవితమంతా ||క||
ప్రభాతగీతం, సంధ్యారాగం—జీవితపథమే ||క||
వలపు పిలుపుల అమరగానం!
తీయని తలపుల అమృతభాండం!
సుకోమల కుసుమ పరాగం!
లలిత కళా హృది మృదుహాసం! ||క||
సరళ పరిమళ గళ మెత్తికూయు,
కోకిల కుహూకుహూ రావం!
తరళ తరంగావళి తాళములో
మృదు మధురాతి మధుర మృదంగం! |క|

రాజా : (చప్పట్లు కొడుతూ) ఓహెూహెూ! అద్భుతం అమోఘం
వండర్‌ఫుల్! నీపేరుకు తగినట్లు నీకళోపాసన ఎంతైనా
స్తుతించ దగింది.

కళ : శ్రుతి మాత్రం మించకూడదు.

రాజా : మతి జాగ్రత్తగా వున్నంతసేపు ఫరవాలేదులే!

కళ : ఆ మతిని మితంలో వుంచడానికే దీనిని కాస్త సేవించండి

[అంటూ ఫ్లాస్కులోని కాఫీ రెండు గ్లాసుల్లో పోసి, ఒకటి రాజాకు అందిస్తుంది.]

రాజా : థేంక్స్.

[సిగరెట్టు పారేసి, కాఫీ త్రాగుతాడు. కళ కూడ త్రాగుతుంది.]

కళ : ఈ రోజు ప్రోగ్రాం ఎలా వుంది?

రాజా : ప్రత్యేకించి నీ నాట్యం చాలా అద్భుతంగా వుంది.

కళ : ఆఁ!

రాజా : ఎంతమంది స్నేహితులొచ్చారను కున్నావ్?

కళ : ఎవరు?

రాజా : అంతా మన కాలేజీ మిత్రులే.

కళ : ఊహుఁ!

రాజా : స్టేజి మీదకు కూడ వచ్చారు.

కళ : ఎందుకు రానిచ్చారు?

రాజా : రానివ్వక పోతే వూరుకోరు, వచ్చి సరిగ్గా కూర్చోరు.

కళ : ఏం చేశారు?

రాజా : ప్రశ్నల వర్షం కురిపించి నా ప్రాణం విసుగెత్తించారు

కళ : ఏం ప్రశ్నలండీ?

రాజా : ఆఁ అసలు నాట్యం చేసింది నువ్వు కాదేమోనని వారి అనుమానం.

కళ : ఎందుకని?

రాజా : ఎందుకేమిటి? నువ్విచ్చిన ప్రోగ్రాములన్నీ నేను చూశాను. కాని, ఈరోజు నీ నాట్యంలో క్రొత్త సొగసు, వింత పోకడ, నూతన భావాలు, తొణుకిసలాడాయి. నాట్యంలోని నూతన భంగిమల మధుభాండం ప్రేక్షకుల్ని మైమరపించింది.

కళ : నిజమా?

రాజా : అక్షరాల. (అదే ధోరణిలో) ఆ మధుభాండాన్ని ఆస్వాదిస్తూ, ప్రేక్షకులంతా ఆనంద సాగరంలో మునిగి పోయారు. దేవేంద్ర లోకమునుండి ఏ రంభో, మేనకో వచ్చిందేమోనను కున్నారు.

కళ : ఆఁ!

రాజా : నిజంగా నువ్వు నమ్ముతావో నమ్మవో కాని, కూర్చున్న వాళ్ళు, కూర్చున్నట్లు బొమ్మల్లా వుండిపోయారు.

కళ : (సంతోషంతో రాజా కుర్చీమీద కూర్చుని) ఆఁ! ఆఁ! అలాగా! నాకసలు తెలియనే లేదే!

రాజా : నువ్వు కూడ తన్మయత్వంలో మునిగి పోయావన్న మాట!

కళ : ఆఁ! ఏముంది లెండి. నా శక్తి కొలది చేశాను.

రాజా : అందుకే అంత రక్తికట్టి కీర్తి వచ్చింది.

కళా : అబ్బ! ఎప్పుడూ లేనిది యివ్వాళ యింతగా చెబుతున్నా రంటే, ఏదో విశేషం వుంది.

రాజా : విశేషం, విశేషాలు శేషం లేకుండా చెబుతాను, విను.

కళా : ఊఁ!

రాజా : నీ నాట్యంలోని క్రొత్తదనం ప్రతివ్యక్తి హృదయంలో ను నూతన ఆనందాన్ని కలిగించింది.

కళా : ఊఁ!

రాజా : ఆ సర్పనాట్యంలో నీ అలంకరణ చూస్తే ఏ నాగలోకం నుంచో వచ్చినట్లనిపించింది.

కళా : ఆఁ!

రాజా : మెలికల పాములా నీ వ్రేళ్ళు తిరుగుతుంటే, వాటితో పాటు ప్రేక్షకుల కళ్ళుకూడ తిరుగుతుండేవి, నీ లయ ననుసరించి ప్రేక్షకుల తలలు వూగుతుండేవి.

కళా : నిజమా?

రాజా : నిజం కళా! నువ్వు పాడిన ''కళామయుం'' అనే పాట వినేవాళ్ళహృదయాల్ని గిలిగింతలుపెట్టిందంటే నమ్ము!

కళా : ఆ తర్వాత?

రాజా : ఆ తర్వాత ...... నీ విరహగీతాలు యువతీ యువ కుల్ని ఆవేశంలో ముంచి, ఉద్రేకంలో తేల్చి వేశాయ్.

కళా : ఓహోహో! ఇంతవరకు మీ కవిత్వం అనర్గళంగా ప్రవహించింది. యిహ, కొంచెం ... దానికి ఆనకట్ట కడితే బాగుంటుంది.

రాజా : నువ్వు ఎదురుగావుంటే ఈ కవితా ప్రవాహం గట్లు, గుట్టలు, కట్టలు తెంచుకొని......

[కళ రాజా నోటిని మూస్తుంది. రాజా కళ చేతిని నెమ్మదిగా తీసి, సిగరెట్టు నోటిలో పెట్టుకుంటాడు. కళ అగ్గిపుల్లగీసి రాజా సిగరెట్టును వెలిగిస్తుంది. రెండు క్షణాలు నిశ్శబ్దం.]

రాజా : మీ నాన్న గారితో చెప్పావా?

కళ : ఏమిటి?

రాజా : ఆ విషయం.

కళ : ఏ విషయం?

రాజా : అదే!

కళ : ఏదీ అని?

రాజా : పెళ్ళి...

కళ : (తెలియనట్లు) ఎవరిది?

రాజా : తెలియదా?

కళ : ఇంకా మీరు చెప్పనిదే నా కెలా తెలుస్తుంది?

రాజా : అయితే, విపులంగా చెబుతా నుండు.

[కళ చెయ్యి పట్టుకొని, దగ్గరకు తీసుకొని పోతాడు. కళ తప్పించుకోవాలని ప్రయత్నిస్తుంది. రాజా గట్టిగా పట్టుకుంటాడు ]

కళ : ఆఁ. ఆఁ. తెలుసు—తెలుసు. చెప్పనక్కర్లేదు.

రాజా : అయితే, చెప్పు.

కళ : ముందు, విడవండి.

రాజా : (కళను కుర్చీలో కూర్చొబెట్టి) చెప్పు. ఏం తెలుసు నీకు?

కళ : అదే......

రాజా : ఏమిటది?

కళ : పెళ్ళి......

రాజా : ఎవరిది?

కళ : (నవ్వుతూ పూరుకుంటుంది.)

రాజా : ఎవరితో.

కళ : (వేలితో రాజాను చూపిస్తుంది.)

రాజా : నోటితో చెప్పాలి.

కళ : (మాట్లాడదు.)

రాజా : నీది, నాది — కలిపితే...?

కళ : (నెమ్మదిగా) మనది.

రాజా : ఊఁ. అలా చెప్పాలి. పాపం సిగ్గేస్తుందా? అబ్బ! పెళ్ళి కూతురు కొచ్చినంత సిగ్గు వచ్చిందే!

[కళ బుగ్గమీద చిటుక వేసి పాడతాడు.]

రాజా : [పాట]

ఓ ప్రేయసీ! నా ప్రేయసీ!!

నీ హృదయ రాగము నేనై,
రాగములోని పల్లవి నీవై,
గంగాయమునల మాదిరిగా
ప్రవహిద్దాం, మోహిద్దాం! ॥ఓ॥

నీ అధర గానము నేనై,
గానములోని మాధురి నీవై,
సుధాబిందువుల మధుపర్కాన్ని
చిలికిద్దాం, కురిపిద్దాం! ॥ఓ॥

నీ గానపు శోభను నేనై,
శోభకు మూలము నీవై,
సుగంధ కుసుమము వలె
వికసిద్దాం శోభిద్దాం! ॥ఓ॥

కళ : (చప్పట్లు కొడుతూ) అమోఘం! అద్భుతం! వండర్‌ఫుల్! మోస్టు వండర్‌ఫుల్! ఒహెూహెూ!

[కళ గట్టిగా నవ్వుతుంటుంది. రాజా కూడా నవ్వుతుంటాడు. ఇంతలో రామన్న వస్తాడు. కళ రాజాలు దగ్గరగా కూర్చుని వుండటం చూసి, వెనక్కి తగ్గి దగ్గుతాడు. రాజా అతన్ని చూసి తన కుర్చీని కొంచెం దూరంగా జరుపుకుంటాడు.]

రామ : అమ్మాయిగారు!

కళ : ఏం రామన్నా!

రామ : ఆయన వచ్చారమ్మా!

కళ : ఆయనెవరు?

రామ : ఆయనమ్మా!... చంద్రం బాబుగారు!

కళ : ఏడీ? ఎక్కడున్నాడు? ఎప్పుడొచ్చాడు?

రామ : ఇక్కడే వున్నారమ్మా! మన యింటికొస్తే, నాన్నగారు తీసుకొచ్చారు.

కళ : ఇక్కడకు తీసుకురా.

రామ : అలాగేనమ్మా! (వెళ్ళి పోతాడు)

రాజా : చంద్రం ఎవరు?

కళ : మా బావ.

రాజా : (కొంచెం గట్టిగా) మీ బావా?

కళ : అవును. చాల మంచివాడు. రచయితకూడాను.

రాజా : (లేచి, అన్యమనస్కంగా) సరే, నేను మళ్ళీ వస్తాను.

కళ : (రాజా చెయ్యి పట్టుకొని కూర్చోబెడుతూ) కూర్చోండి. మిమ్మల్ని మా బావకు పరిచయం చేస్తాను.

[ఇంతలో రామన్న చంద్రం వస్తారు. కాని రాజాను చూసి చంద్రం వెనక్కు తగ్గుతాడు.]

కళ : రా బావా! ఈ కుర్చీలో కూర్చో. (చంద్రం కూర్చుంటాడు. రాజాను చూపిస్తూ) ఈయన నా స్నేహితులు. గొప్ప కళోపాసకులు. బి. ఏ. పాసయ్యారు. పేరు......

రాజా : రాజారావు.

చంద్రం : (నమస్కరిస్తూ) చాల సంతోషం. ఇక్కడకు రావడంవల్ల మీ దర్శన భాగ్యం లభించింది.

రాజా : కళ ఇప్పుడే మీ గురించి చెప్పింది. మీ వంటి గొప్పవారిని దర్శించడం వల్ల జీవితం ధన్యమయింది.

చంద్రం : అదే నేనూ అనుకుంటున్నాను.

రాజా : మీ దర్శనమే......

కళ : సుదర్శనం.

రాజా : నిజం!

చంద్రం : అనవసరంగా మీ యిద్దరూ కలిసి నన్ను పొగిడేస్తున్నారు. కాని, మీ పొగడ్తలకు నే నర్హుణ్ణి కాను.

రాజా : అలాక్కాదు మీలో ఒక ప్రత్యేకత వుంది.

చంద్రం : అది మీలోనే ప్రత్యక్షంగా కన్పిస్తున్నది.

రాజా : ఏమో మరి,... నేనంత సూక్ష్మగ్రాహిని కాను.

చంద్రం : ఏమైనా, మన ఈ కలయికను మరచిపోకండి.

రాజా : అసలు మిమ్మల్ని మరచి పోవాలనుకున్నా మరచి పోలేను.

చంద్రం : ఏమోనండీ! ఏరోజు ఎలావుంటుందో ఎవరికితెలుసు? కాలాన్ని అనుసరించి మానవుల భావాలుకూడ మారడం సహజం కదూ?

రాజా : మీరు నా హృదయాన్ని గ్రహించలేదు.

చంద్రం : (నవ్వుతూ) అగ్రహించకండి.

రాజా : లేదు ... నేనెవరినైనా మిత్రులుగా నిర్ణయించుకుంటే జీవిత మున్నంత వరకు మరచిపోను.

చంద్రం : (చిరునవ్వుతో) చాల భావ గర్భితంగా మాట్లాడుతున్నారే!

రాజా : (నవ్వుతూ) నా మాటల్లో అంతరార్థాలుండవు. కేవలం మీకు సమాధాన మిస్తున్నాను.

రామ : రాజారావు బాబుగారు బాగా చదువుకొన్నవారు...

కళ : చంద్రంగారు ఇంద్రజాలంలాంటి కవిగారు.

రామ : ఇందులో ఎవరూ ఎవరికీ తీసిపోరు......

కళ : ఎవరికి వారే సాటి.

రామ : అమ్మాయిగారు! ఒక్కమాట అడగనా?

కళ : ఏమిటది?

రామ : వీరిద్దరి మధ్య మీ రెవరికి......?

కళ : ఛా! ఏం మాటలని రామన్న! వెళ్ళి కారు సిద్ధం చెయ్యమను.

రామ : కారు రాలేదమ్మా!

కళ : ఏదైనా బండి తీసుకురా.

[రామన్న వెళ్ళిపోతాడు.]

చంద్రం : రామన్న నెందుకు కోప్పడతావు?

కళ : మంచీ—చెడ్డా లేకుండా అవేం మాటలు బావా?

చంద్రం : అతనన్న మాటల్లో తప్పేముంది? మనస్తత్వాన్ని చక్కగా అర్థం చేసుకొన్నాడు.

[ కళ తల వంచుకుంటుంది. రాజా పరధ్యాన్నంగా వూరుకుంటాడు.]

చంద్రం : కళ! మానవుల మనస్తత్వాల్ని గ్రహించడం చాలా

కష్టం. గ్రహించినా, వాటికి అనుకూలంగా సంచరించడం మరింత కష్టం.

కళ : యిష్టమయితే అనుకూలతకు సష్ట ముంటదుగా!

చంద్రం : కాని మానవుల అభిప్రాయాలు, కోరికలు ఎప్పుడూ ఒకే విధంగా వుండవు.

కళ : అది నిజమే కావచ్చు.

చంద్రం : అంచేత, ఎవరితో స్నేహం చెయ్యదలచుకొన్నా, ముందు వారి మనస్తత్వాన్ని చక్కగా అవగాహన చేసుకోవడం అవసరం.

కళ : అన్యోన్యానురాగాలకు బద్ధులైవుంటే, అభిప్రాయాల్లో భేదం వుండదని నా అభిప్రాయం.

[అని రాజా వంక చూస్తుంది.]

రాజా : అభిప్రాయాలు, ఆశయాలు ఒకటైతే, జీవితమంతా ఒకరినొకరు మరచిపోరని నా ఉద్దేశం.

కళ : ఉన్నతాశయాలు హృదయాల్ని కలిపి, ఆదర్శ జీవితానికి పునాదులు వేస్తాయి.

రాజా : పరస్పరానురాగం మనస్సుల్ని ఏకంచేసి, ఆనందాన్ని చేకూరుస్తుంది.

చంద్రం : అంతే నంటారా?

రాజా :<br>కళ : } (ఒకే సారి) ఔను.

చంద్రం : సరే, మీ రిద్దరూ ఏకీభవించి చెబుతుంటే నేను మాత్రం కాదనగలనా?

రామ : (వచ్చి) బండి సిద్ధంగా వుంది బాబు!

చంద్రం : ఆc, రాజారావుగారు! మీరు రేపు ఒక్కసారివస్తారా?

రాజా : ఎందుకు?

చంద్రం : ఏదో కొంచెం కాఫీ తీసుకొని...

కళ : సరదాగా కాలక్షేపం చెయ్యడానికి,

రాజా : అలాగే—వేలయితే వస్తాను.

కళ : వీలయితే కాదు—వీలు చేసుకుని రావాలి.

చంద్రం : అవును.

రాజా : సరే! అలాగే వస్తాను. (నమస్కరిస్తూ) నమస్తే!

చంద్రం : (నమస్కరిస్తూ) నమస్తే.

(రాజారావు వెళ్ళి పోతాడు)

కళ : బావా! మానాన్నగారెక్క డున్నారు?

చంద్రం : ఏదో పనుందని వెళ్ళి పోయారు.

కళ : (ఆశ్చర్యంగా) వెళ్ళిపోయారా?

చంద్రం : ఔను. ఏం అలా అడుగుతున్నావ్?

కళ : ఎప్పుడూ ప్రోగ్రాం మధ్యలో వెళ్ళిపోలేదు. ఈ రోజు ఎందుకు వెళ్ళిపోయారా అని?

చంద్రం : ఏదో పనుందేమో! దాని కింతగా ఆలోచించడ మెందుకు? నడు, చాల రాత్రయింది.

[కళ, చంద్రం, రామన్న వెళుతుండగా—

తెర]

# కళామయి

## మూడవ దృశ్యం.

[ స్థలం: విశ్వనాథం గారి భవనం. అలంకరణంతా మొదటి దృశ్యంలాగే వుంటుంది.

సాయంకాల సమయం : ఐదు గంటలయింది.

విశ్వనాథంగారు ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ, పచార్లు చేస్తుంటారు. రామన్న పేపరు తెచ్చి యిస్తాడు. ]

విశ్వ : (చదువుతూ) ''ఆంధ్రదేశంలో అతిఉన్నత స్థానమును పొంది, కొద్ది కాలములోనే దేశమంతటా మహోన్నత స్థానము నాక్రమించుకొను, భవిష్యద్భాగ్య కళోపాసిని, కుమారి 'కళామయి' అఖండ ప్రతిభ! (పేపరు చూసి) ప్రతిభ! ఉన్నత స్థానం! భేష్! ఈ పత్రికల వాళ్ళకేమీ పనుండదు. గోరంత విషయాన్ని, కొండంతచేసి; తప్పుల్ని ఒప్పులుగాను, ఒప్పుల్ని తప్పులుగాను రాయడంలో అగ్రగణ్యులు.

రామ : ఏమిటది బాబూ?

విశ్వ : కళ ఫొటోవేసి, రాత్రి నాట్యం గురించి పొగుడుతూ రాశారు.

రామ : (సంతోషంగా) ఏం రాశారు బాబూ?

విశ్వ : రాత్రి నాట్యం చాల అద్భుతంగా వుందట!

రాము : అవును బాబు! రాత్తిరి నాట్యం ఐతేబాగుంది.

విశ్వ : (హేళనగా) ఆc!...

రాము : కూచున్నోళ్లు కూచున్నట్టే, బొమ్మల్లా వుండిపోయారు. నిజంగా మీరుంటే......

విశ్వ : (మధ్యలో) ఆc! నేనుంటే, వాళ్ళనే మాటలకు యింకా ఏడ్చేవాడిని.

రాము : (ఆశ్చర్యంగా) ఎవరి మాటలు?

విశ్వ : నాట్యం చూడ్డానికి వచ్చిన వాళ్ళ మాటలు.

రాము : ఏమన్నారు...?

విశ్వ : ఏముంటే నేం లే. చెప్పుతుంటే సిగ్గుకూడాను.

రాము : అదేంటి బాబూ! నాకు చెప్పరానిదా?

విశ్వ : (తల అడ్డంగా వూపుతారు.)

రాము : నేనేమైనా కొత్తవాడినా? పరాయి వాడినా?

విశ్వ : కాదు (నెమ్మదిగా) మా యింటికి కనురెప్పలాంటి వాడవు.

రాము : చిత్తం! అసలు సంగతేంటి బాబూ?

విశ్వ : (విచారంగా) ఏముంది? నాకు చిన్నతనం నుంచీ సాహిత్యమన్నా-సంగీతమన్నా; నాట్యమన్నా—నాటకాలన్నా; కథలన్నా -కళలన్నా ఎంతో యిష్టం. (రామన్న తల వూపుతుంటాడు.) అందుకే నా ముద్దుబిడ్డకు కళామయి అని పేరు పెట్టాను. తల్లిలేని లోటు తెలియకుండా,

గారాబంగా పెంచాను. కళాశాలలో చదివించి, సంగీతం చెప్పించి, నాట్యం నేర్పించాను. మన కళామయి కళో పాసనలో చాలా ప్రసిద్ధి కెక్కింది......

రామ : అది వేరే చెప్పాలా బాబు!

విశ్వ : అది చూసి ఎంతో మురిసిపోయాను, గర్వపడ్డాను.

రామ : ఇంతదాకా మీరు చెప్పింది బాగానే వుంది బాబు! యింతకూ... రాత్తిరి హాల్లో ఏమైనా గొడవొచ్చిందా?

విశ్వ : (విచారంగా) అవును.

రామ : ఏమిటి బాబూ!

విశ్వ : రాత్రి నాట్యం చూస్తూవుండగా నా ప్రక్కనున్న వాళ్ళు నన్ను, కళను నానా మాటలు అన్నారు.

రామ : ఆఁ! ఏమన్నారు?

విశ్వ : ఏమంటారు? వయస్సు వచ్చిన పిల్లను వయ్యారంగా తిరగమని విడిచి పెట్టానట! సిగ్గులేకుండా సీతాకోక చిలుకలా సింగారించుకుని, స్టేజిమీద కెక్కి తైతెక్క లాడుతుందట!

రామ : (ఆశ్చర్యంగా) ఆఁ!

విశ్వ : ఏం చెప్పను రామన్నా! రాజారావుతో కలసి షికార్లు చేస్తుందట!- ఒక్కటా, రెండా? వినలేక పోయాను.

రామ : (విచారంగా) లోకులు నిజంగా కాకుల్లాంటి వాళ్ళు.

విశ్వ : కాకుల్లాంటి వాళ్ళుకాదు—యమకింకరుల్లాంటి వాళ్ళు.

రామ : నిజం బాబు! 'ఎవరెలా పోతే ఏం'? అని వూరుకోరు. 'ఏవరిలో ఏలోటువుందో'! అని పనికట్టుకుచూస్తుంటారు.

విశ్వ : అలా వుండడం ఒక విధంగా మంచిదే అనిపిస్తుందోయ్.

రామ : ఏందుకు బాబు?

విశ్వ : మనలోని లోపాన్ని యిప్పటికైనా తెలుసుకున్నాము.

రామ : చిత్రం!

విశ్వ : ఇంతకాలం నేను ఎవర్ని లెక్క చేయలేదు. ఎంతమంది ఎన్ని అడ్డులువేసినా లెక్క చేయకుండా, స్వేచ్ఛగా కళను ఆరాధించాను. విచారమనేది లేకుండా నిత్యానందం పొందెను. (సోఫాలో కూర్చుని) ఇప్పుడు కళ విషయం కాళ్ళకు బంధమై కూర్చుంది.

రామ : ఇప్పుడు విచారిస్తే ఎలా బాబు?......

విశ్వ : చేసిన తప్పుకు శిక్ష అనుభవించమంటావ్! అంతే కదూ?

రామ : అది కాదు బాబూ! ఏదైనా వుపాయం ఆలోచిస్తే...

విశ్వ : అయితే నువ్వే ఆలోచించు - అపాయంలేని వుపాయమేదైనా.

రామ : (కొంచెం ఆలోచించి) ఒక్క పని చేస్తే బాగుంటుంది.

విశ్వ : (కుతూహలంగా) ఏమిటది?

రామ : అమ్మాయి గార్కి పెళ్ళి చేసేస్తే......

విశ్వ : బాగుంటుందంటావా?

రామ : అవును బాబు!

విశ్వ : భేష్! భేష్!
రామ : పెళ్ళిచేస్తే పిల్లల్లో చాల మార్పు వస్తుంది.
విశ్వ : అదే కావలసింది. వెంటనే ముహూర్తం పెట్టిస్తాను.
రామ : మరి,... పెళ్ళి కొడుకో?
విశ్వ : మన చంద్రం వున్నాడుగా!
రామ : ఆఁ! (ఆగి) కాని,....
విశ్వ : కాని ఏమిటి?
రామ : చంద్రం బాబు గారు ఒప్పుకుంటారా?
విశ్వ : ఒప్పుకోక తప్పుకుంటాడా?
రామ : (మాట్లాడడు)
విశ్వ : ఏం కళకేం లోటు? అందమయింది, బాగా చదువు కున్నది, కావలసినంత డబ్బున్నది.
రామ : ఈ రోజుల్లో ఆ మూడువుంటే చాలు.
విశ్వ : అంతేనోయ్, అంతే!
రామ : అమ్మాయిగార్ని కూడ అడిగితే......
విశ్వ : (మధ్యలో) ఎందు కడగడం?
రామ : మనస్సులు తెలుసుకోడానికి బాబు!
విశ్వ : చంద్రానికి మాత్రం ఏం లోటు?
రామ : ఏలోటూ లేదు.
విశ్వ : అదే కావలసింది. ఇద్దరికీ ఈడు, జోడు—అంతా బాగుం టుంది.

[ఇంతలో చంద్రం వస్తాడు.]

ఖేష్! రావోయ్ చంద్రం!

చంద్రం : ఏమిటి విశేషం?

విశ్వ : నీకొక శుభవార్త చెప్పాలి.

చంద్రం : నేనూ ఒక శుభవార్త చెప్పాలనే వస్తున్నాను.

విశ్వ : ఏమిటది?

చంద్రం : త్వరలో కళ వివాహం.

విశ్వ : అదే నేనూ నీకు చెప్పాలనుకుంటున్నాను.

రాము : మీ కెవరు చెప్పారు బాబూ?

చంద్రం : పరిస్థితులు.

విశ్వ : ఖేష్! అదే కావలసింది. ఎవరో ఒకరు చెప్పారు. చాలు

చంద్రం : మీకు యిష్టమేనా?

విశ్వ : ఇంకా యిష్టమా అని నెమ్మదిగా అడుగుతున్నావా? నువ్వన్న మాట నేనెప్పుడు కాదన్నాను? 'శుభస్య శీఘ్రం' అన్నారు. రామన్నా!

రాము : బాబూ!

విశ్వ : పోయి బ్రాహ్మణ్ణి పిలుచుకురా.

చంద్రం : ఎందుకు?

విశ్వ : ముహూర్తం పెట్టిద్దాం.

చంద్రం : ఈ రోజుల్లో ముహూర్తాల మీద, మంత్రాల మీద...

విశ్వ : మోజు, మక్కువ తక్కువంటావ్! అంతేనా?

చంద్రం : మనస్సులు కలిస్తే మంత్రాలు చేసేదేముంది?

విశ్వ : వింటున్నావా రామన్నా! మన చంద్రం రెండు పూల మాలలతోనే, పెళ్ళి జరిగి పోవాలంటున్నాడు.

రామ : చిత్తం!

విశ్వ : అదే కావలసింది. పెళ్ళిళ్ళ పేరు చెప్పి, యిళ్ళు గుల్లలు చేసుకోడం కూడ మంచిది కాదు.

చంద్రం : కాని ......

విశ్వ : కానీ లేదు—అర్ధణా లేదు. నీ వుద్దేశం చాలబాగుంది. నే నొప్పుకున్నానుగా! రామన్నా! కళను యిలా పిలు.

చంద్రం : (రామన్నని ఆపుజేస్తూ) వుండు రామన్న!

విశ్వ : ఏం?

చంద్రం : కళ యిక్కడకు రాకముందే మీరు నా కొక హామీ యివ్వాలి.

విశ్వ : ఒక్కటి కాదు-వంద హామీలు తీసుకో. ఏం కావాలి? కట్నం కావాలా? డబ్బు కావాలా? భూమి కావాలా? లేక ఆస్తంతా రాసిమ్మంటావా? రాసిమ్మంటే యిస్తాను. నాదేమీ లేదు. కాని, నాకు రామన్నకు రెండు మెతుకులు మాత్రం పెడుతుండండి. చాలు. ఏం రామన్న?

రామ : చిత్తం.

పంద్రం : నా కవేమీ అక్కర్లేదు. ఒక్క హామీ మాత్రం కావాలి

విశ్వ : అడగవోయ్!

పంద్రం : కళ వివాహం ఆమె యిష్టప్రకారం జరగాలి.

విశ్వ : ఇందులో యిష్టా యిష్టాల ప్రశ్నేముంది?

పంద్రం : వుంది. కాని మీరు కష్టపెట్టుకో గూడదు.

విశ్వ : అసలు విషయం చెప్పవోయ్.

పంద్రం : కళ వివాహం ఎవరితో చెయ్యాలనుకుంటున్నారు?

విశ్వ : భేష్! భేష్! బాగా ప్రశ్నించావ్! రామాయణమంతా విని 'రాముడికి సీత ఏమవుతుంది?' అన్నట్లుంది నీ ప్రశ్న!

రాము : అలా అడుగుతారేం బాబూ! మీరుండగా అమ్మాయి గారి పెళ్ళి మరెవరితో అవుతుంది?

సంద్రం : అలా జరగడం అసంభవమనే చెప్పడానికి వచ్చాను రామన్నా!

విశ్వ : (స్తంభించి) ఆఁ!... కళ కిష్టం లేదా? నీ కిష్టం లేదా?

చంద్రం : మీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేనందుకు విచారిస్తున్నాను.

విశ్వ : నీ అభిప్రాయం నా కర్థం కావడం లేదు.

చంద్రం : కళను రాజారావు కిచ్చి వివాహం చేస్తే మంచిదని నా అభిప్రాయం.

విశ్వ : (విస్మయంతో) చంద్రం!

చంద్రం : మీరు ఆవేశపడితే లాభంలేదు. స్నేహం కలియనే కూడదు, కలిస్తే విడిపోవడం కష్టం; విడిపోతే తిరిగి అతకడం అసంభవం. అంచేత......

విశ్వ : అంచేత?

చంద్రం : కళను రాజారావు కిచ్చి వివాహం చెయ్యడం మంచి దని నా ఉద్దేశం,

విశ్వ : ఉద్దేశాల్ని, ఆదర్శాల్ని పట్టుకుని వుంటే, వున్న కాస్త మతీ పోతుంది.

చంద్రం : అయితే, చూస్తూ రెండు జీవితాల్ని నాశనం చెయ్య మంటారా?

విశ్వ : నాశనమో, మోసమో నాకేమీ అర్థం కావటం లేదు.

చంద్రం : ఇందులో మోసమేమీ లేదు. మీరు బాగా ఆలోచించండి. ఏ మాత్రం కంగారు పడినా, యిద్దరి జీవితాల్ని నాశనం చేసినవారవుతారు.

విశ్వ : నాకంతా అగమ్యగోచరంగా వుంది ఆలోచన శక్తి కూడ నశించింది. నువ్వే మళ్ళీ ఒక్క సారి ఆలోచించు.

చంద్రం : (నిశ్చయంగా)పంపసాన్ని ఆలోచించాను. క్షమించండి. నా నిర్ణయం మార్చుకోలేను.

విశ్వ : యిది నీ అంతిమ నిర్ణయమా?

చంద్రం : ఔను. క్షమించండి.

[రెండు క్షణాలు నిశ్శబ్దం]

విశ్వ : సరే! కావలసింది కాక మానదు. కాని యిలా అవ్వ తుందని కల్లో కూడ అనుకోలేదు ... ... చిన్నప్పటి నుంచీ కూడ కళను నీకేయిచ్చి పెళ్ళి చెయ్యాలను కున్నాను... కళకూడ నువ్వంటే ఎప్పుడూ అయిష్ట తగా మాట్లాడలేదు... కాని, ఈరోజున నీసొత్తును, నీ చేతుల మీదుగా యితరుల కివ్వదలచుకున్నా వంటే, యిందులో నేను క్షమించ వలసిందేముంది? (ఆవే శంతో) ఏముంది?—ఏమీలేదు.

చంద్రం : ఇప్పుడు మీరు ఆవేశపడితే లాభం లేదు.

రామ : బాబుగార్కి ఆవేశంవస్తే, ఆరోగ్యం చెడిపోతుంది.

చంద్రం : (విశ్వనాథం గారితో) మీరు వెళ్ళి కొంచెం విశ్రాంతి తీసుకోండి.

విశ్వ : రామన్నా!

రామ : బాబూ!

విశ్వ : ఏమిటో యిదంతా? నాకేమీ తోచడంలేదు. అంతా ఇంద్రజాలంలా కన్పిస్తున్నది...... రామన్నా! నా తల తిరుగుతున్నది...... (రామన్న పట్టుకుంటాడు) గదిలోకి తీసుకెళ్ళు.

[రామన్న విశ్వనాథంగార్ని పట్టుకుని గదిలోకి తీసు కెళతాడు.]

చంద్రం : పాపం! మానవులు ఆనందానికిపొంగిపోతారు; దుఃఖా నికి కుమిలి పోతారు.

[అటుయిటు పచార్లు చేస్తుంటాడు. రామన్న వస్తాడు.]

చంద్రం : ఆయన దగ్గరుండ లేక పోయావా?

రామ : ఆయనకు ఒక గంటవరకు తెలివిరాదు బాబు!

చంద్రం : సరే! కళను యిలా పిలు.

[రామన్న వెళతాడు. ఒకక్షణం నిశ్శబ్దం. కళామయి, రామన్న వస్తారు.]

కళ : ఏం బావా? పిలచావా?

చంద్రం : రాజారావుగా రున్నారుగా?

కళ : వున్నారు.

చంద్రం : రామన్నా! రాజారావుగార్ని యిలా పిలచుకురా.

[రామన్న వెళతాడు.[

కళ : ఎందుకు బావా?

చంద్రం : చెప్పినా నువ్వు నమ్మలేవేమో!

కళ : నువ్వు చెప్పాలేగాని, నమ్మకుండా ఎలా వుండగలను బావా?

చంద్రం : నీ వివాహాన్ని నిర్వహించే బాధ్యత మీ నాన్నగారు నా మీద వేశారు. ఇప్పుడే నీ వివాహం.

[కళ ముఖం కొంచెం వాడిపోతుంది. రామన్న, రాజారావు వస్తారు. కళ తలవంచుకుంటుంది. చంద్రం రాజాను ఒక కుర్చీలో కూర్చుండబెట్టి, రామన్న చెవిలో ఏదోచెబుతాడు. రామన్న బయటకు వెళ్ళి పోతాడు.]

చంద్రం : కళా! మానవ జీవితం చాలా విచిత్రమయింది. అను కోకుండా అకస్మాత్తుగా ఎన్నో ఘట్టాలు జరుగుతుంటాయ్. ఆ ఘట్టాల్లో కొందరికి సుఖం లభిస్తుంది, కొందరికి దుఃఖం కలుగుతుంది. అయితే దుఃఖంలో కూడ ఆనందాన్ని అనుభవించే వాళ్ళల్లో నేనొకణ్ణి. (కళ, రాజాలు చంద్రం వంక చూస్తారు. ఒక క్షణం నిశ్శబ్దం.) ఈ రోజు మీ యిద్దరకు నా చేతి మీదుగా వివాహం చేసే సౌభాగ్యం లభించినందుకు నే నెంతో ఆనందిస్తున్నాను.

[కళ, రాజాలు చంద్రం వంక ఆశ్చర్యంగాను, ఆనందంగాను చూస్తుంటారు. రామన్న రెండు పూల మాలలు తెచ్చి చంద్రాని కిస్తాడు.]

చంద్రం : (ఒక పూలమాలను రాజాకు యిస్తూ) రాజా! నువ్వు నాకు సోదరుని వంటి వాడవు. ఇదుగో! ఈ పూల మాలతో కళను అలంకరించి, అంగీకరించు. (రెండవ మాలను కళకు యిస్తూ) కళా! యిదుగో! ఈ పూలమాలను రాజారావుగారి మెడలో వేసి ఆయన్ని స్వీకరించు.

కళ : (ఆవేశంతో) బావా! నీలో యింత త్యాగంవుంగా?

చంద్రం : నాలోవున్నది త్యాగం కాదు — అనురాగం. ఆ అను రాగమే మి యిద్దరకు వివాహం చెయ్యమని ప్రేరేపించింది.

[అంటూ కళ చేతిని, రాజా చేతితో కలుపుతాడు. కళామయి, రాజారావులు ఒకరికొకరు పూలమాలలు వేసుకొని, చంద్రానికి నమస్కరిస్తారు. చంద్రం ప్రతి నమస్కారం చేసి "సుఖీభవ" అని దీవిస్తాడు. రామన్న తలవంచుకొని నిలబడి వుంటాడు.]

చంద్రం : మీ నాన్నగారు లోపల వున్నారు. వెళ్ళి, ఆయన ఆశీర్వాదాన్ని కూడ పొందండి.

[కళ, రాజాలు నెమ్మదిగా లోపలకు వెళతారు.]

రామ : (దగ్గరకు వచ్చి) మీరు దేవతలు చంద్రం బాబూ!

చంద్రం : లేదు, రామన్నా! నేనూ మానవుణ్ణే. పరస్పర సహాయం మానవ కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని నేను నిర్వర్తించుకున్నాను. అంతే.

రామ : వాళ్ళిద్దరకు పెళ్ళిచెయ్యడం మీ కర్తవ్యమా?

చంద్రం : అవును రామన్నా! ప్రేమ హృదయాల్ని కలపడం ఒక పవిత్రకర్తవ్యం.

రామ : అయితే అమ్మాయిగారంటే మీకు ప్రేమలేదా?

చంద్రం : వుంది రామన్నా! ఎంతో ప్రేమవుంది...ఆ ప్రేమను మాటల్లో వెల్లడించలేను. .... కాగితంమీద వ్రాయలేను......కుంచెతో చిత్రించలేను...రాతిమీద చెక్కలేను......

రామ : అబ్బ! అమ్మాయిగారంటే అంత ప్రేముందా బాబూ!

చంద్రం : (తన ధోరణిలో) ఎంతో ప్రేమ వుంది ... ఆ ప్రేమ భూమికన్నా, ఆకాశంకన్నా, విశాలమైంది ... సము ద్రంకన్నా లోతైంది... అగ్నికన్నా వేడైనది... మంచు కన్నా చల్లనైంది.

రాము : (ఆశ్చర్యంతో) యింత ప్రేమ మనస్సులో వుంచుకొని ఎలా పెళ్ళి చేశారు బాబు?

చంద్రం : నేను చేసిందేమీ లేదు రామన్నా! అంతా పరిస్థితులు చేశాయి. కళ, రాజారావులు నిర్మల ప్రేమతో అను రాగ బద్ధులై వుంటారని గ్రహించాను.

రాము : అందుకని,......

చంద్రం : (ఆవేశంతో) వాళ్ళ ప్రేమానురాగాలకు అడ్డుపడే అప విత్రుణ్ణి, ఘాతకుణ్ణి కాలేను రామన్నా! (విచారంగా) రామన్నా! వెళ్ళు నన్నుకలవర పెట్టకు. నీ పని చూసుకో. (తల పట్టుకొంటాడు.)

రాము : బాబూ!...

చంద్రం : (వ్యధిత హృదయంతో) రామన్నా! వెళ్ళు. నా మన స్సుకు బాధ కలిగించకు. నా ప్రవర్తన విచిత్రంగా వుంటుంది. ఎవరికో కాదు — నాకే విచిత్రంగా వుంటుంది.

[వెళ్ళి పోతాడు.]

రాము : అబ్బ! ఎంత మెత్తని మనస్సు! ఎంత మంచిబుద్ధి! మనిషి కాదు—దేవత!

[రామన్న వెళుతూ వుండగా—

తెర]

# కళామయి

## నాల్గవ దృశ్యం.

[స్థలం: రాజారావు యింట్లో ఒక గది. చక్కగా ఆధునిక పద్ధతిలో అలంకరించబడి వుంటుంది.

సాయంకాల సమయం : నాలుగు గంటలయింది.

రాజారావు కుర్చీలో కూర్చుని రేడియో మీదవున్న చంద్రం ఫొటోను తదేక దృష్టితో చూస్తుంటాడు.]

రాజా : చంద్రం! నువ్వు వూహల కందని ఉదార పురుషుడవు. విచిత్రభావాలుగల త్యాగమూర్తివి. (చంద్రం ఫొటోను పట్టుకుని) చంద్రం! నీ హృదయం ఎంత విశాలమైంది! (ఫొటోను అటు, యిటు త్రిప్పి) నీకు కళ మీద ప్రేమ లేదా? (ఏదో వింటున్నట్లు) ఆఁ?.. ఏమిటి?... వుందా? ... చాల ఎక్కువగా (ప్రేమిస్తున్నావా?).ఆఁ? నీ హృదయంలో తుపాను రగుల్తోన్నా? (ఫొటోను రేడియో మీదపెట్టి) ఔను. నిజమే! నీకు చాలా ద్రోహం చేశాను. నీకే కాదు, కళకుకూడ చాలా ద్రోహంచేశాను. ఆమెను నీనుండి లాక్కొన్నాను. కాని,... కాని... కళకు నేను తగుదునా? (తిరిగి ఫొటో తీసి) చంద్రం! నీకన్న నాలో ఏం విశేషంవుంది? ప్రవర్తనలోనా — ప్రతిభలోనా? జ్ఞానంలోనా—త్యాగంలోనా? ఎందులో గొప్పవాణ్ణి?
[కళామయి కాఫీ తెస్తుంది. రాజారావు చంద్రం ఫొటోను మామూలుగా పెట్టేస్తాడు.]

కళ : (కాఫీ బల్లమీద పెట్టి) ఏమండీ! 'చంద్రం! చంద్రం అంటున్నారు. మా బావా వచ్చాడా?

రాజా : ఊఁ!

కళ : ఏడీ? ఎప్పుడొచ్చాడు? ఎక్కడున్నాడు? (అక్కడ కలయ చూచి వెదుకుతూ లోపలకెళుతుంది.)

రాజా : పాపం! ఒకరంటే, మరొకరికి ఎంత ప్రేమ! ఎంత అనురాగం! ఎంత వాత్సల్యం!.... అబ్బ!... ఇంతప్రేమ, యింత అనురాగం, యింత వాత్సల్యం వుండికూడ ... (శూన్యంలోకి చూస్తూ వుద్రేకంతో) నాలో ఏముంది?

కళ : (వచ్చి) మీ కంతా వేళాకోళమే! మా బావ రానేలేదు.

రాజా : (వినిపించుకోక, కళ భుజాలు పట్టుకుని) కళా! నాలో ఏముంది?

కళ : ఏముంది?— మీలో మీరే వున్నారు.

రాజా : (గట్టిగా) నాలో ఏముంది? నన్నెలా ప్రేమించావ్? ఎందుకు ప్రేమించావ్?

కళ : ఆదా సంగతి! సరి, సరి! అయితే, తమరికివ్వాళ ప్రేమ పాఠం నేర్పాలన్న మాట! అయితే కూర్చోండి; చెబుతాను. (రాజాను కూర్చోబెట్టి, తాను కూర్చుంటూ) అం నాలో ఏముందని మీరు ప్రేమించారు?

రాజా : నీలోనా?...(జవాబుతోచక) నీలో...నీలో ఏదో చెప్పలేని ఆకర్షణవుంది.

కళ : (వెంటనే) మీలోకూడ అంతే.

రాజా : అంటే?

కళ : అంటే-గింటే ఏమీలేదు. ప్రేమకు ఒక ప్రత్యేక అర్థం చెప్పడం కష్టం.

రాజా : మరి...?

కళ : సాధారణంగా కొందరు సౌందర్యాన్ని చూసి, మరి కొందరు విద్యను చూసి, యింకా కొందరు ధనాన్ని చూసి ప్రేమిస్తారు. కొన్ని అద్భుత ఆదర్శాలు, నూతన భావాలు, వింత చేష్టలు, అస్పష్ట సౌందర్య రేఖల వల్ల కూడ కొందరు మోహితులవుతారు. ప్రేమలో వింత వింత.....

రాజా : (మధ్యలో) ఇందులో మన ప్రేమ దేనికి సంబంధించింది?

కళ : మన ప్రేమ మనకే సంబంధించింది. (కాఫీ అందిస్తూ) యిహ, ఆ విషయం విడిచిపెట్టి కొంచెం కాఫీ త్రాగండి. (యిద్దరూ త్రాగుతారు. చంద్రం ఫొటో వంక చూసి) ఓహో! మీరు బొమ్మల్ని చూసి మనుషులను కొంటారే!

రాజా : 'మనిషి'ని గుర్తించుకోడానికి బొమ్మలుకూడ అక్కర్లేదు.

కళ : ఫొటో దగ్గర పెట్టుకొని, నిజంగా మాబావ వచ్చినట్లే మాట్లాడేరే!

రాజా : (సిగరెట్టు ముట్టిస్తూ) అదే నేను చెప్పేది! మీ బావ ఫొటో కూడ అవసరం లేదు. అతనొక గొప్ప 'మనిషి'. అటువంటిమనుషులు మరచిపోవాలన్నా మరువుకురారు.

కళ : నేను ముందే చెప్పానుగా - అతనిది నిర్మలమైన హృదయం.

రాజా : కల్మషం లేని మనిషి.

కళ : మనస్సులోవున్నది మొహమాటం లేకుండా చెప్పేస్తాడు.

రాజా : నాతోనూ ఒక మాట చెప్పేడు.

కళ : (కుతూహలంతో) ఏం చెప్పేడండీ?

రాజా : 'మా కళను నీ కప్పగిస్తున్నాను, ఏలోటు రానివ్వకుండా జాగ్రత్తగా చూస్తూ, ఆమె కోరికలన్నీ తీర్చడం నీ బాధ్యత' అన్నాడు.

కళ : మీ రేమన్నారు?

రాజా : 'సరే'! అన్నాను.

కళ : (హేళనగా) ఓహో! అన్నారా?

రాజా : ఔను. ఏం?

కళ : అబ్బే అనడానికి, ఆచరణలో పెట్టడానికి చాలదూరమని.

రాజా : మనం అనకేపోవాలి; అంటే — అక్షరాల జరిగి తీర వలసిందే.

కళ : నిజం!

రాజా : ముమ్మాటికి.

కళ : అయితే నాకొక కోరికవుంది. చెప్పమంటారా?

రాజా : ఓ! ఒక్కటి కాదు, ఎన్ని కోరికలున్నా తీరిగ్గా కూర్చుని చెప్పు.

కళ : తప్పక తీయస్తారా? (రాజా తల వూపుతాడు) చెప్పమంటారా? (మళ్ళీ వూపుతాడు) నాకు సినిమాల్లో నాట్యం చెయ్యాలనీ, నటించాలనీవుంది.

రాజా : (స్థంభించి పోతాడు.)

కళ : ఏం అలా చూస్తారు?

రాజా : (కొంచెం సర్దుకొని) సినిమాల్లోనా?

కళ : అవును ఏం?

రాజా : అబ్బే!

కళ : మీరు మాట అనకే పోవాలి; అంటే - అక్షరాల జరిగి తీరవలసిందేగా!

రాజా : కాని ప్రస్తుత సినిమాలోకంలో చాల లోపాలున్నాయి.

కళ : (మాట్లాడదు.)

రాజా : కోప మొచ్చిందా?

కళ : (చిన్న బుచ్చుకుని) ప్రతిదానిలోను మంచి - చెడ్డలు కూడుకునే వుంటాయిగా!

రాజా : అవుననుకో. అయినా, తెలిసుండి కూడ చెడ్డదారి నెందుకు పోవాలి?

కళ : బాగు చెయ్యడానికి, సంస్కర్తలు కావడానికి.

రాజా : అంటే?

కళ : అంటే, సినిమాపరిశ్రమ కళకు కేంద్రస్థానం. అందులో ఏమైనా లోపాలున్నా సవరించడం మనవంటి కళోపాసకుల కర్తవ్యం,

రాజా : కళా! నీకు కళంటే చాల యిష్టమని నాకు తెలుసు. నువ్వు యింతవరకు యిచ్చిన ప్రదర్శనలవల్ల ఎంతో పేరు వచ్చింది. నా కెంతో సంతోషంగా వుంది. కాని, మనవంటి వాళ్ళు సినిమారంగంలో ప్రవేశించడం మంచిది కాదు.

కళ : ఎందుకని?

రాజా : కొంచెం అధికారమున్న ప్రతివాడు, పచ్చగావుంటే తారల్ని రెచ్చగొట్టి విడిచి పెడతాడు.

కళ : మనం వాళ్ళ ధనానికి ఆశపడి వెళ్ళడం లేదుగా!

రాజా : అయినా వాళ్ళు అనేక వేషాలువేసి మోసాలు చేస్తారు.

కళ : మీకు నా మీద సందేహమా?

రాజా : (కళ నోరుమూస్తూ) ఛా, ఛా! లేనిపోని చిచ్చులు తెచ్చి పెట్టుకోడం మంచిది కాదని చెప్పాను. తర్వాత నీ యిష్టం.

కళ : మీకు కష్టంగావుంటే నా కోరికను విరమించుకొంటాను.

రాజా : అసలు సినిమారంగం మీద నీ కెందుకింత మోజు?

కళ : కళోపాసకుల హృదయాల్లో ఉన్నత భావాల్ని కల్పించి కళను సంస్కరిస్తూ, భారతదేశపు నలుమూలల ......
[ఇంతలో డైరెక్టరు గోకులదాసు, అసిస్టెంటు డైరెక్టరు అవతారం అట్టహాసంగా తయారై వస్తారు.]

దాసు : (కళవంకు చూస్తూ) ఒక్క భారతదేశమే కాదు — ఈ విశాల విశ్వంలోని నానాదేశాల్లో మీ పవిత్ర నామధేయం

ప్రతిధ్వనించాలి. మీ కళారాధన చూసి సృష్టికి మూల మైన పంచభూతాలు, విచిత్ర ప్రకృతి దద్దరిల్లాలి. మీ కళామయ జీవితం ప్రపంచంలో విప్లవాన్ని లేపదీసి, నూతనానందాన్ని విరజిమ్ముతూ, ప్రతిస్థలంలోను......

అవ : (అందుకొని) అంటే, సూక్ష్మమైన రాళ్ళనుండి పెద్దపెద్ద పర్వతాల వరకు, చిన్నచిన్న గుంటలు మొదలు మహా సముద్రం వరకు, గడ్డి తునకనుంచి, భయంకరమైన అడవులదాక—అంటే ప్రతిచోట. మీ పేరు మెరుపు తీగెలా మెరుస్తూ, ఢంకాలా మ్రోగాలి. (దాసుతో) ఏం గురూ?

దాసు : నువ్వూరుకోవోయ్! (కళవంక చూస్తూ) అఖండ, అద్వితీయ, అమర ఆశాజ్యోతి; సౌందర్య ప్రపూర్ణ కళోపాసి; సహృదయ కళారాధకురాలు; అమృతమయ కళావాసి, శ్రీమతి కళామయిగార్కి (రాజా వంకచూసి) శ్రీ రాజా రావుగార్కి మా హృదయ పూర్వక వందనాలు. (నమస్కరిస్తాడు. కళా రాజాలు కూడ ప్రతి సమస్కారం చేస్తారు.) అవతారం! వీరికి నమస్కరించవోయ్!

అవ : ఆ?... అయితే, నా నమస్కారాలు కూడ అందుకోండి.

రాజా : మీ రెవరో తెలుకో వచ్చునా?

అవ : ఓ! లక్షణంగా! (దాసును చూపిస్తూ) వీరు "మృత్యుంజయ పిక్చర్స్" వారిపర్మనెంటు డైరెక్టరు శ్రీశ్రీశ్రీ గోకుల

దాసుగారు. గొప్ప ప్రజ్ఞావంతులు. ఓడల్ని బళ్ళు చేస్తారు, బళ్ళను ఓడలు చేస్తారు; ఆకాశాన్ని భూమి చేస్తారు, భూమిని..

దాసు : యిఖ, చాలించవోయ్!

అవ : (వెంటనే) ఆ! చాలించాను.

కళ : మీరు డైరెక్టరు గోకులదాసుగారా? పేరు వినడమే కాని, ఎప్పుడూ చూడలేదు. రండి. కూర్చోండి.

దాసు : (కుర్చీలో కూర్చుంటూ) థేంక్స్.

కళ : (అవతారం వంక చూపి) వీరెవరండీ?

దాసు : అతను వయసకి బావమరదవుతాడు లెండి. ప్రస్తుతం నా దగ్గరే అసిస్టెంటుగా పని చేస్తున్నాడు.

కళ : పేరు?

దాసు : సారీ! పేరు, మురళీ గోపాలకృష్ణ......

అవ : సూర్య సత్య లక్ష్మీనారాయణ సీతారామాంజనేయ మోహనావతారం.

కళ : అబ్బ! పెద్దాపురం చేంతాండంతుందే!

దాసు : ఆ! అందుకే 'అప్-టు-డేట్'గా 'అవతారం' అని కట్ చేసి పారేశాను.

రాజా : తమరేం పని మీద వచ్చారు?

దాసు : మీ కళామయ సువర్ణ జీవితాన్ని తీర్చిదిద్ది, మెరుగు పెట్టడానికి వచ్చాం. మీ కీర్తిలతల్ని నాలుగు మూలలా

విస్తరింపజేసి, బ్రహ్మరథం పట్టించడానికి వచ్చాం.

కళ : అంటే?

అవ : అంటే, నానా దేశాల్లో, మూల మూలలనున్న కళోపాస కుల నందర్నీ బైటకుతీసి, బ్రహ్మరథం పట్టించి పారే యడం మా డైరెక్టరుగారి ముఖ్యోద్దేశం. అందుచేత . . . .

దాసు : (కళ వంక చూస్తూ) నిర్మలమైన మీ కళోపాసనలోని పరిమళాన్ని—

అవ : (దాసుతో పాటు నెమ్మదిగా) అసలు మీలోనున్న పరి మళాన్ని—

దాసు : పరిపూర్ణమైన ప్రతిభను, అఖండమైన కళాతృష్ణను చూసి—

అవ : (దాసుతో పాటు నెమ్మదిగా) ముఖ్యంగా మీ కోమల ముఖ పద్మాన్ని చూసి—

దాసు : మా "కళారాధన" అనే సాంఘిక చిత్రంలో ప్రధాన నాయకి పాత్రను యివ్వదలచు కొన్నాం. ఏమైనాయ్ అవతారం!

అవ : అంతే, అంతే! వీరికే యివ్వాలనుకున్నాం. ఇతరుల కెందుకిస్తాం? బంగార ముండగా వెండెందుకు?

రాజా : (విసుగ్గా) ఏమిటిదంతా?

కళ : ఏముందండీ! మీ అభిప్రాయం చెప్పండి. వీరు మన మీద ఎంతో ఆశపెట్టుకు వచ్చారు,

అప : సర్టెన్లీ. మా ఆశ, నిరాశచెయ్యకండి. మీరు నిరాకరిస్తే, మాలోని కళను ఖూనీ చేసిన వారవుతారు.

కళ : ఏమండీ! వేదకబోయిన తీగె కాళ్ళకు తగిలినట్లు, మన కోరికననుసరించి, గోకులదాసుగారు స్వయంగా వచ్చి అడుగుతున్నారు. మీ అభిప్రాయం కూడ చెప్పండి.

రాజా : (మాట్లాడడు.)

అప : (కళ వంక చూస్తూ) మీ కోర్కె — అంటే, మీలోని కళాతృష్ణను శ్రీ గోకులదాసుగారు చక్కగా, పూర్తిగా తీరుస్తారు. (రాజా వంక చూసి) రాజారావుగారు మౌనంగా వున్నారు. మౌనమంటే, అర్థాంగీకార మన్న మాట. (కళతో) మీరు ముందు ఒప్పుకోండి అక్కయ్యగారూ, (దాసుతో) ఏం గురూ? (కళముఖం పరిశీలనగా చూసి) అక్కయ్యగారు ఒప్పుకున్నట్టే.

దాసు : ఆల్‌రైట్. శ్రీమతి కళామయిగారు మా ప్రార్థనంగీకరించి, మా 'కళారాధన' చిత్రంలో నాయకి పాత్రను స్వీకరించదలచు కొన్నందుకు......

అప : మా ప్రొడక్షను తరఫున ధన్యవాదాలు.

దాసు : రాజారావు గారి అభిప్రాయమేమై వుంటుందో?

అప : (వెంటనే) ఏమై వుంటుందో!

కళ : ఏమండీ! మీ అభిప్రాయం చెప్పండి.

రాజా : (సిగరెట్టు వెలిగిస్తూ) సరే, నీ యిష్టం. నీ కోరిక కాదన

లేను. (లేచి) ఆఁ! మిష్టర్ దాస్! మీరు మీ ప్రయ త్నాల్లో వుండొచ్చు. (వెళ్ళిపోతాడు.)

అవ : (ఎగిరి గంతువేసి) అయితే ఈ రాత్రినుంచే ఘూటింగు ప్రారంభిస్తాం!

దాసు : (కొంచెం కోపంగా) ఎవరు?

అవ : మనమేనండీ!

కళ : వుండండి; యిప్పుడే వస్తాను. (లోపల కెళుతుంది.)

దాసు : అవతారం! శుద్ధ అవతారంలా తయారవు తున్నావోయ్!

అవ : నా పేరే అవతారంగా!

దాసు : ఛీ! ఛీ! ఇన్నాళ్ళనుంచి నాతో వుంటున్నావ్; ఏ మను షుల దగ్గర ఎలా మాట్లాడాలో తెలీదు. నీ మూలంగా నా పరువు, ప్రతిష్ట—అంతా ధ్వంసమై పోతుంది.

అవ : అసలు వుంటేగా!

దాసు : సోర్‌ముయ్. ఇలాగే వున్నావంటే డిస్‌డిస్ చేస్తాను.

అవ : (అమాయకంగా) నన్నా?

దాసు : (కోపంగా) నిన్నే అనవసరంగా అధికప్రసంగంచెయ్యకు.

అవ : నేనా?

దాసు : అరె ఇడియట్! నోరు మూసుకు పో. (అవతారం వెళు తుంటాడు.) పోతున్నావా? నీతో బలేచిక్కు వచ్చి పడింది. (శాంతంగా) ఆగవోయ్! (అవతారం ఆగుతాడు) ఎదో కోపం వచ్చినప్పుడు అలాఅంటానే అనుకో. నువ్వు లేకుండా, నాకు ఒక్కనిమిషం పని జరుగుతుందా?

అవ : (తిరిగి వస్తూ) ఓస్! యింతేనా?

దాసు : చూడు, అవతారం! కళామయంటే, ఏదో పెద్ద 'కళా దేవత' అనుకున్నాం. చూశావా? ఎలావల్లో వేశానో!

అవ : యిహనేం! మనరొట్టె నేతిలో పడ్డదన్న మాటే! అదీ గాక, నాకెందుకీ గొడవ, శుద్ధ బ్రహ్మచారిని.

దాసు : మనం వెంటనే పని ప్రారంభించాలి.

అవ : హీరోను వెదకాలిగా!

దాసు : వెధవ హీరో! మళ్ళీ వాడికో యిరవైవేలో, ముప్పైవేలో తగలేయడమా? నాన్‌సెన్స్. (తనను చూపుకుంటూ) వీరు చాలరు? డైరెక్టర్ అండ్ హీరో. ఎలావుంటుంది?

అవ : భష్టుగా వుంటుంది— కోతికి కొబ్బరకాయ దొరికినట్టు. అయినా, నాకేం కావాలి, శుద్ధబ్రహ్మచారిని.

[కళ వస్తుంది. యిద్దరు గప్-చిప్‌గా నిలబడివుంటారు.]

కళ : గోకులదాసు గారు!......

దాసు : మీకంత శ్రమవద్దు. "దాసు" అంటే చాలు. నేను కళకు అంటే ఆర్ట్‌కు దాసుణ్ణి.

కళ : (నవ్వుతూ) అంతా కళకు దాసులమే. ఆఁ అయన కూడ ఒప్పుకున్నట్లే. యిహ మీరు అన్నీ సిద్ధం చేసుకోవచ్చు.

దాసు : మెనీమెనీ థేంక్స్. అయితే యిహ మేము వెళతాం.

కళ : నమస్తే!

['నమస్తే' అంటూ దాసు, అవతారం వెళ్ళిపోతారు. కళ కుర్చీలోకూర్చుని దీర్ఘంగాఆలోచిస్తుండగా— తెర]

# కళామయి

## ఏడవ దృశ్యం.

[స్థలం: రాజారావు యింట్లో పడక గది. మంచానికి ఒకప్రక్క సోఫా, మరొక ప్రక్క రెండు కుర్చీలుంటాయి. డ్రాయరు మీద కొన్ని మందుసీసాలు, గాజు గ్లాసు, పళ్ళున్నాయి.

రాత్రి సమయం: పది గంటలయింది.

రాజారావు మంచంమీద పడుకుని వుంటాడు. మంచానికి ఆనుకొనివున్న కుర్చీలో చంద్రం కూర్చుని వుంటాడు.]

చంద్రం : రాజా! మీకిలావుంటే జబ్బెలా తగ్గుతుంది చెప్పండీ!

రాజా : (నీరసంగా) ఏం చెయ్యమంటారు?

చంద్రం : మీ శరీరం చాలా నీరసపడి పోయింది. కొంచెం ఈ మందు తీసుకోండి. (యివ్వబోతాడు.)

రాజా : వద్దు.... నా శరీరమే కాదు, నా ఆత్మకూడ నిరసపడి పోయింది. అది ఈ మందులవల్ల బాగుపడదు.

చంద్రం : మీకంత బాధకలగడానికి కారణం?

రాజా : క్షమించండి. నా హృదయవేదనను మరొకరికి పంచ డం నా ఉద్దేశం కాదు.

చంద్రం : మీ హృదయంలో యింత వ్యథ వుండంటే, నా మనస్సుకూడ ఎంత బాధపడుతుందో ఒక్కసారి ఆలోచించండి.

రాజా : ఆలోచించాను. కాని, నా గాథవింటే, మీ నిర్మల
హృదయం ఎంతోబాధపడుతుంది. క్షమించండి.

చంద్రం : అస్తమానూ క్షమించమనడం బాగాలేదు. మీకు నొప్పి
కలిగే ప్రశ్న అడగడం నాదేతప్పు. నన్నే మీరు క్షమిం
చాలి. (అంటూ రాజా రెండుచేతులు పట్టుకుంటాడు.)

రాజా : మీ హృదయం చాల కోమలమైనదని నాకు తెలుసు.
కాని, మీ ప్రశ్నకు సమాధాన మివ్వలేనందుకు
విచారిస్తున్నాను.

చంద్రం : పోనీ లెండి. ఆ విషయం యిహ విడిచిపెట్టండి.

రాజా : (తన ధోరణిలో) సృష్టికి విరుద్ధంగా మీలోని ఉదార
త్వం, త్యాగం దోచుకొని, నా దృష్టికి నేనే దొంగ
నయ్యాను.

చంద్రం : దాని గురించి మీరేమీ నొచ్చుకోవద్దు.

రాజా : మీరు నెమ్మదిగా 'నొచ్చుకోవద్దు' అన్నారు. కాని,
నా మనస్సులో ఎంతగా గుచ్చుకొని వుందో మీకెలా
చెప్పను?

చంద్రం : గతాన్ని గురించి ఆలోచించడం అనవసరం.

రాజా : కాని నేను చేసిన నేరం చాలపెద్దది. దానికి మీరు
ఏశిక్ష విధించినా ఆనందంగా అనుభవిస్తాను. అప్పు
డైనా నా ఆత్మ కొంతవరకు శాంతిస్తుంది.

చంద్రం : (విచారంగా) నేరం! శిక్ష! అంతే అర్థమయిందిమీకు.

(ఆగి) సరే. నేను విధించే శిక్షకు బద్ధులై వుండాలి. (రాజారావు తల వూపుతాడు.) అయితే, ఈ మందు త్రాగండి. (మందు అందిస్తాడు.)

రాజా : ఎవరి మాటనైనా ఎదిరించగలను, కాని మీ మాటను తిరస్కరించడానికి మనస్కరించడంలేదు. (మందు త్రాగుతాడు.)

[రెండు క్షణాలు నిశ్శబ్దం, కళ బాగా అలంకరించు కుని వస్తుంది.]

కళ : (చంద్రాన్ని చూసి) ఎప్పుడొచ్చావు బావా?

చంద్రం : ఇప్పుడే వచ్చాను.

కళ : కాఫీ తెమ్మంటావా?

చంద్రం : వద్దు... నువ్వు ఎక్కడ కెళుతున్నావ్?

[రాజారావు గోడవైపుకు తిరిగి పడుకుంటాడు.]

కళ : మీటింగు వుంది బావా.

చంద్రం : యింతరాత్రిలో మీటింగులకి, మీటింగులకి వెళ్ళాలా?

కళ : (మాట్లాడదు.)

చంద్రం : రాజాకు యింత సుస్తీగా వుండగా నువ్వు బయట కెళ్ళడం మంచిదికాదు.

కళ : నేను వెళ్ళకపోతే ఈ రాత్రికూడ మీటింగు ఆగి పోతుంది బావా!

చంద్రం : ఏమంటే కానియ్.

చంద్రం : రాజాను పీడించి, పిప్పిచేస్తున్నది—మనోవ్యాధి......
జెంగ. ఎందుకో తెలుసా?

కళ : (అమాయకంగా) ఎందుకు?

చంద్రం : విచిత్రమైన నీ ప్రవర్తన గురించి.

కళ : (ఆశ్చర్యంగా) నా ప్రవర్తన గురించా?

చంద్రం : ఔను. ప్రస్తుతం నీ ప్రవర్తనలోని మార్పు అతన్ని
పీడిస్తున్నది.

కళ : (ఆవేశంతో) బావా!

చంద్రం : వాస్తవికమైన విషయం విషంతో సమానమన్నారు...
నిజం చెబితే అంత ఆవేశమెందుకు?

కళ : నాలో మీకు బాధకలిగేంత మార్పువచ్చిందా?

చంద్రం : ఆ మార్పు నన్నుకూడ ఆశ్చర్యపరుస్తున్నది.

కళ : బావా! ఈలోకంలో నువ్వేనన్ను బాగా అర్థం చేసు
కున్నావనుకున్నాను. నీకుకూడ నేను వింతగానే కన్పి
స్తున్నానా?

చంద్రం : నిజమే కళా! నీలో ఎంతో మార్పువచ్చింది. అయితే,
నీ హృదయ పవిత్రవతల్ల ఆ మార్పును నువ్వు గమ
నించక పోవచ్చు.

కళ : ఆఁ!

చంద్రం : కాని సమాజం చాల చెడ్డది. దానిని కూడ దృష్టిలో
వుంచుకోవాలి.

కళ : (నిరసనగా) సమాజం చాల చెడ్డది!...అటువంటిచెడ్డ దానితో మనకేం సంబంధం బావా?

చంద్రం : పొరబడుతున్నావ్ కళా! మానవుడు సమాజానికి ఒక అంగం. నువ్వు, నేను—ప్రతిజీవి కూడ సమాజానికి లొంగి, దాని ఆజ్ఞలను, నియమాలను తప్పనిసరిగా పాటించవలసిందే.

కళ : ఎంత నియంతృత్వం! ఎంత క్రూరమైనదీ సమాజం!

చంద్రం : చాల క్రూరమైంది, అతి భయంకరమైంది, దానిని ఎదుర్కోడం కష్టం. ఎదుర్కోడానికి ప్రయత్నిస్తే పాతాళానికి అణగ త్రొక్కుతుంది, అవమాన పరుస్తుంది— యింకా ఏమైనా చేస్తుంది.

కళ : అబ్బ! ఎంత నిరంకుశత్వం!

చంద్రం : కాని, దాని కట్టుబాట్లకులొంగి, అనుకూలంగా వున్న వాళ్ళకు బ్రహ్మరథం పడుతుంది; ఆధిపత్యం యిస్తుంది...మనమంతా సమాజంయొక్క యినుప పంజ్లో చెప్పినట్లు ఆడే కీలుబొమ్మలం.

కళ : నేను మాత్రం కీలుబొమ్మలా వుండలేను.

చంద్రం : యింకేం చేస్తావ్? సమాజానికివిరుద్ధంగా సంచరిస్తావా?

కళ : స్వేచ్ఛలేని సమాజంలో వుండటమే మంచిది కాదు.

చంద్రం : (కంగారుగా) కళా!

కళ : ఔను బావా! స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేని జీవితం

వ్యర్థం. నువ్వు చెప్పినట్లు సమాజ నియమాలకు బద్ధులైవుంటే; స్వేచ్ఛను, స్వేచ్ఛలోని ఆనందానికి స్వస్తిచెప్పాలి. పంజరంలోని చిలుకలా స్వేచ్ఛలేని బ్రతుకెందుకు?

చంద్రం : కాని సమాజాన్ని విడిచిపెట్టి వుండటం నువ్వు అను కున్నంత సులువైన పనికాదు.

కళ : మనకుమనమే ముందుగా సంబంధాన్ని తెంచుకుంటే, సమాజమేం చేస్తుంది?

చంద్రం : మనం తెంచుకున్నా, అది మాత్రం మనల్ని విడిచి పెట్టదు.

కళ : ఏం చేస్తుంది?

చంద్రం : మానసిక బాధను కలిగించి జీవచ్ఛవాలుగా తయారు చేస్తుంది.

కళ : ఎవర్ని?

చంద్రం : తన ఉచ్చులోంచి తప్పించుకునే వాళ్ళని.

కళ : (నిట్టూర్చి) బాగానే వుంది.

చంద్రం : అంచేత,... లోగడ నువ్వొకసారి రాజాతో "కళాపాస కుల హృదయాల్లో ఉన్నతభావాల్ని కల్పించి, కళను సంస్కరించాలి" అన్నావ్. జ్ఞాపకముందా?

కళ : వుంది.

చంద్రం : అలాగే, అల్పబుద్ధితో సంచరిస్తూ, సమాజాన్ని కళంక

పరచే, స్వల్ప హృదయాల్లో ఉన్నత భావాల్ని కల్పించి సమాజాన్ని సంస్కరించాలి.

కళ : ఇక ఈ ఉపోద్ఘాతం విడిచిపెట్టి అసలు విషయంచెప్పు బావా? ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్?

చంద్రం : నీకు, నాకు—ముఖ్యంగా రాజా హృదయానికి శాంతి లభించాలంటే......

కళ : (కంగారుగా) ఆఁ! అంటే ..?

చంద్రం : కొన్నాళ్ళు నువ్వు సినిమారంగాన్ని విడిచిపెట్టి, ఇంటిని కనిపెట్టుకుని వుండాలి.

[ఇంతలో డైరెక్టరు గోకులదాసు, అసిస్టెంటు డైరెక్టరు అవతారం, ప్రొడ్యూసరు రత్నం, అంతా అట్టహాసంగా అలంకరించుకుని వస్తారు. రత్నానికి కొద్దిగా నత్తి. అవతారం సిగరెట్టు టిన్ను, అగ్గిపెట్టి పట్టుకుని వుంటాడు.]

దాసు : (వస్తూ) అసంభవం. మా 'కళారాధన' ఫిల్ము తయారయ్యేంత వరకు కళామయిగారు సినిమారంగాన్ని విడిచిపెట్టడం అసంభవం.

అవ : మీరు ఈ రంగాన్ని విడిచిపెడితే, మా జీవితాలు గంగలో కలియవలసిందే.

దాసు : ఫిల్ము మధ్యలో విడిచిపెట్టి మీరు రంగుమారిస్తే వూరుకోము. (రత్నంతో) ఏమంటారు?

రత్నం : (నత్తివల్ల మాటరాక, తల్లడిల్లుతూ) ఔను - ఔను. ఎ - ఎలా వు - వూరు కుంటాము? వ - వాళ్ళు ర - రాసిన బ - బాండు లెటె- లేదు.

[సోఫాలో కూర్చుంటాడు.]

దాసు : బాండులతో ఎంత పనియినా చేస్తాం.

అవ : నలుగురికీ చూపించి, అల్లరిచేస్తాం, అరెస్టు చేయిస్తాం అందరి కాళ్ళూ......

చంద్రం : (కోపంగా) నోరుముయ్! (అవతారం అదరిపడతాడు)

దాసు : (కళ్ళజోడు సర్దుకుంటూ) ఓహో! చంద్రం గారా?

రత్నం : (నత్తితో) ఎ - ఎవరు? చ - చంద్రం గ -గారే!

చంద్రం : ఈ మధ్య షూటింగు ఎక్కువై చత్వారంవచ్చినట్లుంది.

అవ : అవునండీ! యిద్దరకూ చత్వారమే. పాపం! వారి కళ్ళు రాత్రులే కాని, పగలు కనిపించవు.

దాసు : నువ్వూరుకోవోయ్! (కూర్చుంటూ చంద్రంతో) మీరు రాసిన కథే యిప్పుడు షూటింగు జరుగుతుంది.

అవ : దాదాపుగా చాలావరకు పూర్తయింది.

(సిగరెట్టు టిన్ను దాసుకు అందిస్తాడు.)

దాసు : యిహ, పదిరోజుల్లో చిత్రం పూర్తి కావాలి. (రత్నానికొక సిగరెట్టు యిచ్చి, తానొకటి తీసుకుంటాడు.)

రత్నం : (నత్తితో) క - క - కళామయి గారు ర - రాకపోవడం వ - వల్ల షు - షు - షూటింగు ఆ - ఆగిపోయింది.

చంద్రం : ప్రస్తుతం కళ రాదు.

దాసు : రాదూ?

చంద్రం : రావడానికి వీల్లేదు.

రత్నం : (నత్తితో) వి - వీల్లేక పో - పోతే ఎట్లా? బ - బాండు లె - లె - లేదు? (కాగితాలు చూపిస్తాడు.)

చంద్రం : అగ్గిపుల్లగీసి తగల బెట్టండి.

దాసు : అయితే, రాదా?

చంద్రం : (కోపంగా) రాదు. యిప్పుడు రావడానికి వీల్లేదు. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి,

కళ : (కంగారుగా) బావా!

చంద్రం : నువ్వూరుకో కళా!

కళ : కాదు బావ! అబాండు నాచేత్తోరాసిచ్చాను. దానిని....

చంద్రం : (మధ్యలో) గోకులదాసు చేసిన అవమానాన్ని మరచి పోయావా? (దాసు అదరిపడతాడు.)

కళ : లేదు బావా! మళ్ళీ అతను క్షమార్పణకోరుకున్నాడు.

చంద్రం : క్షమార్పణ కోరడం అతని ఎడమచేతి పని; మళ్ళీ కతిసంనా వ్యవహరించడం అతని చిటుకలోని పని.

అప : నిజమేనండి! వారికత్తికి రెండువైపులా పదునే. కాని శ్రీ గోకులదాసుగారు కళామయిగార్ని ప్రాధేయపూర్వకంగా "యిక ముందు ఏస్త్రీని అవమానించనని, అలివాటులో జరిగిన ఈ పొరపాటు మన్నించ" మని కోరితె, కళామయిగారు క్షమించారు.

వాసు : (కోపంగా) అవతారం!

అవ : అబ్బే, ఏం లేదండీ! అప్పటినుంచీ కళామయి గార్ని చాలా గౌరవంగా చూస్తున్నారని చెబుతున్నా.

రత్నం : (నత్తితో) గొ - గోకుల ద - దాసు అ - అ - అంత పని చె — చేశాడా?

చంద్రం : మీరు మాత్రం ఏం తక్కువ?

[ రాజారావు మూలుగుతాడు. కళ, చంద్రం అతని మంచం దగ్గర కెళతారు. చంద్రం రాజా మంచం మీద ప్రక్కగా కూర్చుంటాడు.]

కళ : ఎలా వుందండీ?

రాజా : చాలా బాగుంది... హాయిగా వుంది.

కళ : కొంచెం పండ్లరసం తీసుకోండి. (యివ్వబోతుంది.)

రాజా : (దగ్గుతూ) వద్దు. అక్కర్లేదు.

కళ : ఏం కావాలి?

రాజా : ఏమీ అక్కర్లేదు. అన్నీ వున్నాయ్. (దగ్గుతూ) మందు వుంది, రసంవుంది, డబ్బువుంది. మీ నాన్నగారు పంపగా వచ్చిన రామన్న వున్నాడు. యింకేం కావాలి? (ఆగి) నువ్వువెళ్ళు. పాపం! వాళ్ళంతా నీకోసం చూస్తున్నారు.

కళ : (అమాయకంగా) అవునండీ! నేను వెళ్ళక పోవడంవల్ల నాలుగురోజులు షూటింగు ఆగిపోయింది. అవసరమైతే రామన్నను పంపండి; వస్తాను.

రాజా : అలాగే.

[లోపలనుంచి రామన్న వస్తాడు.]

రామ : వెళుతున్నారా అమ్మా?

కళ : ఔను, రామన్నా!

రామ : ప్రొద్దున్న వెళ్ళకూడదమ్మా?

కళ : (నెమ్మదిగా) ఇప్పుడు మాటింగు వుంది రామన్నా!

రామ : ఈ రాత్రివేళ......

రాజా : (దగ్గుతూ) రామన్నా! నువ్వూరుకోవోయ్.

[రామన్న వూరుకుంటాడు. చంద్రం తలవంచుకొని కూర్చుంటాడు.]

కళ : (రాజాకు దగ్గరగావెళ్ళి) ఏం చెయ్యను చెప్పండి?

రాజా : నీ యిష్టప్రకారం చెయ్.

కళ : మీరు కోప్పడితే ఎలా?

రాజా : వెళ్ళమని చెప్పానుగా! కళా! ఈ రాజా నీ మనస్సుకు నొప్పికలిగించలేదు. (దగ్గుతూ) వెళ్ళు. స్వేచ్ఛగావెళ్ళు.

కళ : (అమాయకంగా) అయిపోగానే వెంటనే వచ్చేస్తాను.

రాజా : మంచిది. (ప్రక్కకు పడుకుంటాడు.)

కళ : రామన్నా! ఏం కావాలో జాగ్రత్తగా చూస్తూవుండు.

రామ : అదివేరే చెప్పాల అమ్మా?

కళ : (చంద్రంతో) బావా! నువ్వుకూడ యిక్కడేవుండు. నేను వచ్చిన తర్వాత వెళుదువు గాని.

చంద్రం : (తల ఎత్తకుండా) అలాగే.

అవ : అందరూ కళోపాసకులే......అంతా కళామయజీవులే ...కళారాధనకు అంతా కంకణం కట్టుకున్నవారే.

రత్నం (వాచీ చూసుకుని, నత్తితో) అ - అబ్బ! చ - చాల ట - ట - టై మ - మైంది.

దాసు : కళామయిగారు! వెళదామా?

కళ : ఆఁ— వస్తున్నాను.

[కళ, దాసు, అవతారం, రత్నం వెళ్ళిపోతారు. ఒక క్షణం నిశ్శబ్దం.]

చంద్రం : (నిట్టూర్చి) నిజం! ప్రేమ బలికోరుతుంది. అనురాగం ఆహుతి కావాలంటుంది. మోజు మైకం కమ్మిస్తుంది. కళకు కళారాధన పిచ్చిలో బాహ్య ప్రపంచమే కన్పించడం లేదుగదా!

రాజా : (మూల్గుతూ) కళా! కళా! (లేవబోతూ) చంద్రం! కళ ఏదీ? (గట్టిగా) ఎక్కడ కెళ్ళింది? ఏమయింది?

చంద్రం : (రాజాను పరుండబెట్టి) కళారాధనకు వెళ్ళింది. (ఆగి) కళకు కళోపాసన మీదమోజు, మీకు కళంటే ప్రేమ; నాకు మీ యిద్దరిమీద అనురాగం.

రాజా : ఎంతకాలం యిలా ఒకరికోసం మరొకరు తపించడం? చంద్రం యింకేమీ మార్గంలేదా?

చంద్రం : మీరు కంగారు పడకండి. నేను అన్నివిధాల ప్రయ

త్నించి, కళమనస్సును మార్చడానికి ప్రయత్నిస్తాను. సంసారాన్ని చక్కగా సవరించుకున్న తర్వాతే కళోపాసన. కుటుంబాలు నాశనమౌతున్నా లెక్క చెయ్యకుండా, కళారాధనలో మునిగిపోతే, ముందుముందు, కళకే పెద్దదెబ్బ తగులుతుంది. మీరు నిశ్చింతగా పడుకోండి. ఈ విషయం నేను చూస్తాను.

[రాజా మూలుగుతూ పడుకుంటాడు. రామన్న పక్క సవరిస్తుంటాడు. చంద్రం కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తుండగా—

తెర]



# కళామయి

## ఆరవ దృశ్యం.

[స్థలం: "కళావాహిని స్టుడియో"లో ఒక భాగం.
రాత్రి సమయం: రెండు గంటలయింది.
ఎలక్ట్రిక్ దీపాలు దేదీప్యమానంగా వెలుగుతుంటాయి. దాసు, అవతారం, రత్నం చాలహడావిడిగావుంటారు. కళామయి బాగా అలంకరించుకుని హార్మోనియం ముందు కుర్చీలో కూర్చుని వుంటుంది. ]

అవ : (హార్మోనియం సర్ది) ఆఁ! వెరీగుడ్ (కళతో) మీరు కొంచెం తల పైకెత్తండి. (కళ తల పైకెత్తుతుంది.) యింకొంచెం. ఆఁ! ఆఁ! వెరీగుడ్.

దాసు : నువ్వు ఆగవోయ్.

అవ : (వెంటనే) ఆగేను.

దాసు : కళామయిగారు! ఈసీను చాలా ఉత్సాహంగా ఆక్టు చెయ్యాలి. బహుశా అంతా మీకు తెలిసేవుంటుంది.

అవ : ఆ! ఆ! తెలిసేవుంటుంది.

కళ : నాగురించి మీరు శ్రమపడ నక్కర్లేదు.

దాసు : శ్రమకాదు—సేవ. కళాసేవ. ఈ "కళారాధన" చిత్రం సర్వాంగ సుందరంగా తయారుచెయ్యడానికి నా సర్వ శక్తుల్నీ వినియోగించడం నా ధర్మం.

అవ : మా జీవిత లక్ష్యం.

దాసు : (రత్నంతో) యిహ, ప్రారంభిస్తాం.

రత్నం : (నత్తితో) అ - అలస్యం ె - దేనికి?

దాసు : మిష్టర్ కెమెరా మెన్!

అవ : ఏదో పనిమీద బయట కెళ్ళాడు.

దాసు : నాన్ సెన్స్! అతని కిప్పుడే పనితగులడిందా? (ఆగి, కళతో) అందాకా ఒక్కసారి రిహార్సల్ చేద్దామా?

కళ : అలాగే.

దాసు : అయితే కానివ్వండి. పాటపాడుతూ నాట్యం చెయ్యాలి.

అవ : రెడీ ప్లీజ్. సైలెన్స్.

[కళామయి కొంతసేపు హార్మోనియం వాయించి, తర్వాత పాటపాడుతూ నాట్యం చేస్తుంది.]

కళ : [పాట]

భారతీయ భాగ్యాల
బంగారు ధరణీ!
వీరపుత్రుల నిచ్చు
అందాల తరుణీ! ॥భా॥

దేశ దేశాలన్నీ
దివిటీలు పట్టాయి,
ఆశతో నీ నీడ
తీసుకొను చున్నాయి! ॥భా॥

మధువునే చిలికించు
నీ వాణి తోనే,
పదును తేరగలదు
ఈ విశ్వ వీణ! ॥భా॥

అవ : (చప్పట్లు కొడుతూ) వండర్‌ఫుల్! వండర్‌ఫుల్!
దాసు : మాట్లాడకు.
అవ : ఆహాహా! ఏమిగానం! ఏమి కంఠం! చెవులు తరించి పోయాయి.
దాసు : నోరు ముయ్యవోయ్.
అవ : (వినిపించుకోనక) ఓహోహో! సృష్టిలోని మహోన్నత సౌందర్యాన్ని చూసే భాగ్యం ఎన్నాళ్ళకు కలిగింది! ఆహాహా..........
దాసు : ఏయ్! అవతారం! నోరు మూసుకుంటావా? పీక నొక్క మంటావా?
అవ : పీక నొక్కితే చావనూ?
దాసు : చస్తే పీడ వదిలిపోతుంది.
అవ : అమ్మ బాబోయ్! చావడమే! నేను చస్తే, ... నేను చస్తే మా ఆవిడ ముండమొయ్యదూ?
దాసు : అసలు నీకు పెళ్ళాంకూడ ఏడ్చిందా అని?
అవ : ఏడవడ మేంటి? బంగారంలాంటిదాన్ని తీసుకొచ్చాను.
దాసు : (ఆశ్చర్యంగా) ఆఁ!—అలాగా!
అవ : (నాలుక కరచుకుని) అబ్బెబ్బె! లేదండీ! పెళ్ళాంలేదు.

పెన్నీ తీసుకొనిరాలేదు. (ఆగి) అయినా, నా భార్య నీకు చెల్లెలవుతుంది కదండీ! ఆఁ- అంతే. అంతే.

రత్నం : (నత్తితో) అవతారం! పు - వు - వూరుకో వో - వోయ్.

[రామన్న కంగారుగా వస్తాడు.]

రాము : అమ్మాయి గారూ!......

కళ : ఏం రామన్నా?

రామ : బాబుగారు అస్తమాను మీగురించే కలవరిస్తున్నారమ్మా.

కళ : మా చంద్రం బావ లేడూ?

రాము : వున్నారమ్మా! ఈనాలుగురోజులు ఆయనకు నిద్దరేలేదు.

కళ : సరే. నువ్వువెళ్ళు. నేను తర్వాతవస్తాను.

రాము : మీరు రండమ్మా!

కళ : ఇప్పుడే వస్తాను వెళ్ళు. (రామన్న అక్కడే వుంటాడు.) ఏం రామన్నా!

రామ : మీరు వచ్చేవరకు నేను వెళ్ళనమ్మా. రాజారావుబాబు గారి వ్యాధికంటే, చంద్రంబాబు గారి బాధ ఎక్కువగా వుంది. వారుపడేబాధ నేను చూడలేను. ఇదంతా మీ కోసం. మీరువస్తే, ఆయనవ్యాధి, ఈయన బాధాకూడా తగ్గుతుంది.

కళ : ఆఁ!

రాము : రాజారావు బాబు గార్కి ఏఙఖ్ఖా లేదట! మీ కోసమే బెంగ పెట్టుకున్నారట!

కళ : ఎవరు చెప్పారు?

రామ : డాక్టరుబాబు చెప్పాడు. అందుకే మీరువచ్చేంత వరకు నేను వెళ్ళను.

కళ : సరే! యిప్పుడే వస్తానుండు.

దాసు : నో, నో, నో. ఇప్పుడు వెళ్ళడానికి వీల్లేదు.

అవ : మెల్లగా ఈ సీను పూర్తిచేసి, చల్లగావెళ్ళవచ్చు.

కళ : వీల్లేదు. ఇప్పుడే వెళ్ళాలి.

దాసు : అలాకుదరదు. ఈసీను పూర్తిచేసితీరాలి.

అవ : ఆఁ. చేసి తీరాల్సిందే! (రత్నంతో) ఏం గురూ!

రత్నం : (నత్తితో) ఆఁఆఁ! సి -సీను పు - పూర్తి చె - చెయ్యాలి. అ - అంతవరకు వె - వె - వెళ్ళడానికి వి - వీల్లేదు.

కళ : (ఆశ్చర్యంగా) ఆఁ! వెళ్ళడానికి వీల్లేదా?

దాసు : లేదు.

కళ : నా భర్తకు జబ్బుగావుంటే వెళ్ళడానికి వీల్లేదా?

అవ : (ఒక్కొక్క అక్షరాన్నిపలుకుతూ) వె - ళ్ళ - డా ని-కి- వీ - ల్లే - దు.

కళ : (నిశ్చయంగా) అలా కుదరదు. నేను వెళ్ళితీరాలి.

దాసు : ఎలా వెళతావో చూస్తానుగా!

అవ : ఆఁ- చూస్తాంగా!

కళ : (కోపంగా) గోకులదాసు గారు! మర్యాదగా మాట్లాడండి సమయం వచ్చిందని మీ చిత్తమొచ్చినట్లు మాట్లాడితే, తర్వాత పశ్చాత్తాపపడవలసి వుంటుంది.

దాసు : అది మన జన్మలో లేదు.

అవ : వీరి జన్మలోనే కాదు, వీరి తాత ముత్తాతల జన్మల్లో కూడ లేదు.

కళా : జరిగిన పరాభవం మరచి.....

దాసు : (మధ్యలో) పరాభవమా? అదిఎలా వుంటుందో మనకు తెలీదు.

అవ : వీరికే కాదు, వీరిని పుట్టించిన వారికికూడ తెలీదు. అదు గాక, నాకెందుకీ గొడవ శుద్ధబ్రహ్మచారిని!

కళా : పాపం మీకేం తెలియదేం? (రత్నంతో) ఏమండీ! డైరెక్టరుగారు చాలా అమాయకులు కదూ!

రత్నం : (నత్తితో) అ - అ దంటా వె - వేరే స - స - సంగతి. ముందు ఇ - ఈ సి - సీను పు - పు - పూర్తి క - కావాలి.

కళా : (కోపంగా) పూర్తికావాలేం? (గట్టిగా) ఇప్పుడు కాదు, కాదు, కాదు. కావాలంటే తర్వాత చూడొచ్చు. ఈ కళారాధన నా భర్త జీవితంకంటే ఎక్కువకాదు. వెళుతున్నాను.

[అంటూ కళామయి వెళ్ళబోతుంది. దాసు, అవతారం కళకు అడ్డంగా నిలబడతారు. రామన్న వాళ్ళిద్దరినీ దూరంగా త్రోసి కళకు దారి చేస్తాడు. వెంటనే రత్నం రామన్న దగ్గరకెళ్ళి అడ్డంగా నిలబడతారు.]

రత్నం : (నత్తితో) ఎ - ఏయ్! కు - కు - కు - కూలోడా! ను- నువ్వు బ - బ - బయటకి ఫో.

రామ : నేను బయటకు పోవాలా? మీరంతా దౌర్జన్యం చేస్తుం టారా?

రత్నం : (నత్తితో) బ - బ - బాండుల ప - ప - ప్రకారం జ - జరగాలి.

రామ : బాండుల ప్రకారం జరగాలా? (అంటూ రత్నం కోటు జేబులోని కాగితాలు లాక్కొని చించివేస్తాడు. రత్నం రామన్న మీదకు రాబోతే, అతని పీకగట్టిగా పట్టుకుని) ఇంత కఠినంగా ప్రవర్తించే మీరు కళాసేవకులా? (గట్టిగా నొక్కుతూ) ఏం మాట్లాడవేం?

[ఇంతలో విశ్వనాథంగారు వస్తారు.]

విశ్వ : (కంగారుగా) రామన్నా! రామన్నా! ఏమిటీపని?

రామ : (విడిచిపెట్టకుండా) ఏం లేదు బాబూ! అమ్మాయిగారికి అన్యాయం జరుగుతుంటే వూరుకోలేను.

విశ్వ : భేష్! భేష్! (రామన్న చెయ్యిపట్టుకుని) కాని, ముందు అతన్ని విడిచిపెట్టు.

రామ : (రత్నాన్ని విడిచిపెట్టి) వీళ్ళు పచ్చిదుర్మార్గులు బాబూ!

విశ్వ : అలాగే వుండాలి. అంతా సన్మార్గులైతే ఏం లాభం? (కళతో) ఏమమ్మా! లోకంలో అంతా మంచివుంటే, అది 'మంచి' అనిపించుకుంటుందా?- అనిపించుకోదు.

దాని ప్రక్క కొంచెమైనా చెడ్డవుంటేనే మంచిలోని విషం అర్థమవుతుంది. ఏమంటావ్?

కళ : (వచ్చే దుఃఖాన్ని ఆపుజేసుకుంటూ) నావల్ల చాలా అపరాధం జరిగింది నాన్నా!

విశ్వ : అలా అనుకోడమే తప్పు. నువ్వు చేసిన నేరమేమిటి చెప్పు. స్వేచ్ఛగా తిరగటం అపరాధమా? ప్రేమించి పెళ్ళిచేసుకోవడంతప్పా? హృదయ పూర్వకంగా కళను ఆరాధించడం నేరమా? ఏదితప్పు?

కళ : (మాట్లాడదు.)

విశ్వ : కాని, దేనికైనా ఒకహద్దు, నియమంవుండాలి. స్వేచ్ఛగా కళారాధన చేస్తూ, ప్రేమించి పెళ్ళి చేసుకున్నావ్! కాని, లాభమేమిటి? హద్దుమీరిపోయి యిల్లు - వాకిలీ విడిచిపెట్టి కళకు దాసోహం చేస్తున్నావ్!

[ఇంతలో రాజారావు, చంద్రం వస్తారు.]

చూడు! నిన్ను ఎంతగానో ప్రేమించిన రాజారావు నీ కోసం ఎంత కృంగి, కృశించాడో చూడు!

కళ : (రాజా దగ్గరకెళ్ళి) నేను మీ అందరి హృదయాలకు నొప్పి కలిగించాను.

రాజా : అది నీ తప్పుకాదు. నీలోకలిగిన వింత కోరికలది.

కళ : అంతా అర్థం చేసుకున్నాను. నా కళాభిమానం మనల్ని వేరుచెయ్యాలని చూసింది. కాని, యిప్పుడు తెలుసుకున్నాను. నన్ను క్షమించరూ!

రాజా : నన్నుకాదు కళా క్షమార్పణకోరడం—ఇడుగో! మీబావ! ఆయన్ని ముందు క్షమించమను.

చంద్రం : క్షమించడానికి నేనెవరిని రాజా? అదిగాక, క్షమార్పణ కోరుకోడానికి, కళ ఏం నేరం చేసింది?

కళ : లేదు బావా! మా గురించి త్యాగమూర్తివై ఎంతో ప్రపకారం చేసిన, నీ ఉదార హృదయానికి బాధ కలిగించాను......

చంద్రం : నాకేమీ బాధలేదు కళా! కాని, నువ్వు పెద్దభారాన్ని భుజాల మీద వేసుకున్నావు. కళను సంస్కరించ దలచుకున్నావు. దానికి మేమంతా సహకరించాలను కున్నాము. అయితే, కళ మీదవుండే అభిమానంవల్ల ఆత్మీయుల్నికూడ మరచిపోయావు. కాని, యిప్పుడు తెలుసుకున్నావు. అంతేచాలు. ఇందులో ఎవరిదీ తప్పులేదు.

అవ : లేక పోడమేంటి? తప్పంతా మా డైరెక్టరు గారిదే. ఆయన మూలంగానే యింత గొడవొచ్చింది.

దాసు : చాల్లేవోయ్. (వెళ్ళిపోతాడు.)

రత్నం : (నత్తితో) ను - నువ్వు నొ - నోరు ము- ము - మూసుకోవోయ్. (వెళ్ళిపోతాడు.)

అవ : పెద్ద మనుషులు వెళ్ళిపోతున్నారు.

చంద్రం : ఇలాంటి దద్దమ్మలు ఒకళ్ళిద్దరు వుండటంవల్లే 'కళ' పాడయిపోతున్నది.

కళ : వాళ్ళను అని మాత్రం లాభమేమిటి బావా! ఇదంతా నా అపరాధం.

విశ్వ : అపరాధం, ప్రమాదం — అంతా అనవసరం. కళో పాసకుల్లో కల్మషంవుంటే 'కళ' అభివృద్ధిపొందలేదు.

రాబా : అంతా దాసులాంటి వాళ్ళ వుంటారా?

విశ్వ : దాసులాంటి వాళ్ళసంగతి నాకు తెలీదుగాని, మోస గాళ్ళు ఎక్కువని చంద్రం చెప్పాడు.

చంద్రం : కాని యిప్పుడు కాలం మారిపోయింది. కళాకారులు నిర్మలమైన హృదయంతో కళాసేవ చెయ్యడానికి కంక ణం కట్టుకున్నారు.

కళ : పవిత్రమైన కళారాధన చేసి ధన్యులమవుదామను కొని, పరిస్థితుల ప్రభావంవల్ల ఎంతమంది స్త్రీలు పతన మవుతున్నారో!

అవ : మీరు మాత్రం అగ్గిలాంటివారు. మీకేమీ భయంలేదు.

కళ : నావలె నూటికి, కోటికి ఒకరుంటే లాభమేమిటి?(ఆగి) అబ్బ! కళపేరిట ప్రపంచంలో ఎన్నిమోసాలు జరుగు తున్నాయ్!

రామ : అవునమ్మా! నేను కూడ సినిమాలంటే మొదట్లో ఎంతో మోజుపడ్డాను. కాని, సినిమా కళను ఆరాధిం చాలంటే కష్టాల్ని, నష్టాల్ని - ఎన్నో ఎదుర్కోవాలని చంద్రం బాబుగారు చెప్పారు. వెంటనే విరమించు కున్నాను.

విశ్వ : భేష్! భేష్! నీకూ గాలి బాగాసోకిందన్న మాట! సరి! సరి! యిహనేం, మనమంతా కళోద్ధారకులమే.

రామ : వద్దు బాబూ! మనకింక ఈ కళోపాసనే వద్దు. అందులో, ఈ మాయాలోకంలాంటి సినిమాలోకం అసలే వద్దు.

చంద్రం : అలాఅనకు రామన్నా! కళ చాల నిర్మలమైంది, పవిత్రమైంది.

విశ్వ : పవిత్రమైందే కాదు - విచిత్రమైంది కూడాను.

అవ : నిజం! నిజం!

రాజా : మనమంతా కళోపాసకులం. కళ కలుషితం కాకుండా చూడాలి.

అవ : కళను - ప్రత్యేకించి సినిమా కళను మంచి పద్ధతిలో నడిపించడానికి ప్రయత్నించడం, మనవంటి కళోద్ధారకుల ముఖ్య కర్తవ్యం.

విశ్వ : దానికి మార్గం?

చంద్రం : ఒక్కటే వుంది?

విశ్వ : ఏమిటది?

చంద్రం : కళను పవిత్రమైన వస్తువుగాభావించి, ఆరాధించాలి. కళ ప్రజల కోసమని చాటుతూ స్వార్థరహితంగా పని చెయ్యాలి.

విశ్వ : భేష్! భేష్!

ఉప : అలాచేస్తే సినిమా కళ సర్వాంగ సుందరంగా తయారవుతుంది.

విశ్వ : సర్వాంగ సుందరమే కాదు-స్వర్ణమయం అవుతుంది! స్వర్ణమయం!

రాజా : అయితే ఈ పవిత్ర కార్యాన్ని చక్కగా నిర్వహించటానికి మనమంతా కంకణం కట్టుకోవాలి.

విశ్వ : కంకణం కట్టుకోవడం పెద్దసంగతి కాదు; కాని, యింటి దగ్గర ఎవర్నీ లంకణాలు చెయ్యనివ్వకుండా చూసుకోవాలి.

[కళ సిగ్గు పడుతుంది.]

చంద్రం : బాగా చెప్పారు. మీ మాటను నేను సమర్థిస్తున్నాను.

విశ్వ : అదే కావాలి.

ఉప : అయితే, కళను బాగుచెయ్యడానికి మనమంతా పూనుకోవాలి.

విశ్వ : ఉద్ధరించి నిర్మలమైన అద్దంలా తయారు చెయ్యాలి.

రాజా : కళే కళను ఉద్ధరించాలి.

కళ : మీ అందరి సహాయం ఉండాలిగా!

చంద్రం : అందరి హృదయాలు కళకోసం తెరచే వున్నాయి.

రాజా : చంద్రం గారి ఒక్క హృదయం వెయ్యి హృదయాలతో సమానం.

ఉప : ఆయన చెప్పినట్లు కళ ప్రజల కోసమని చాటడమే మన కర్తవ్యం.

కళ : కళమూలంగా కుటుంబాల్లో అంతఃకలహాలు రాకుండా చూసుకోవాలి.

విశ్వ : అసలు విషయమే అది.

చంద్రం : ముఖ్యంగా అందరూ గమనించవలసిందే అది.

విశ్వ : బాగా చెప్పావ్. చక్కగా యిల్లు సవరించుకుంటూ, హాయిగా కళారాధన చెయ్యండి. ఎవ్వరూ మీకు అడ్డు రారు. పైనుండి నేను అన్నీ చూస్తుంటాను. (ఆగి) ఓహ్! చాల రాత్రయింది. యిహ వెళదాం పదండి.

కళ : (రాజాతో) వెళదమా?

రాజా : నడు. రండి, చంద్రం గారూ!

విశ్వ : సరి, సరి! నువ్వు నా కూడా రావోయ్ చంద్రం!

చంద్రం : వస్తున్నా.

[చంద్రం, విశ్వనాథం, రాజారావు, కళామయి, రామన్న వెళ్ళి పోతారు.

అవ ఏమిటో ఈ ప్రపంచం! ఎవ్వరికీ అర్థం కాదు. బహుశా ప్రపంచాన్నయినా అర్థం చేసుకోవచ్చు; కాని ఈ సినిమా పరిశ్రమను అర్థం చేసుకోడం చాలా కష్టం, ఇందులో అంతా వేషగాళ్ళే! ఒకర్ని మించిన వేషం మరొకరు వేస్తారు. ఒకరికంటే చక్కని భాష యింకొకరు మాట్లాడతారు. వేషం, భాష - ఈరెండే వీళ్ళకు అలంకారాలు. (ఆగి) సినిమా కళను పరిశుభ్రం చెయ్యాలి. పూర్తిగా చెయ్యాలి. అప్పటివరకు పవిత్ర

కళారాధకులకు సరియైన స్థానం లభించదు. చంద్రం గారు చెప్పినట్లు కొంతవరకు మురమ్మత్తు జరిగింది; ఇంకా కొంత కావాలి.

[నేపథ్య గీతం]

కళోపాసకా!

ఓ కళోద్ధారకా! ॥క॥

కళలోనే వికసించు,

కళలోనే పవళించు,

కళకోసం నీ జీవిత

కుసుమాన్నే అర్పించు. ॥క॥

[అవతారం ఆనందంతో తాళంవేస్తూ వీలయినంత వరకు గొంతు కలపడానికి ప్రయత్నిస్తాడు.]

కళలోనే కలుషితమా?

కలలోనే తలవకుమా!

కళకోసం జీవించు

కళకోసం మరణించు. ॥క॥

కళోపాసకా!

ఓ కళోద్ధారకా! ॥క॥

[పాట వినిపించినంతవరకు అవతారం తాళంవేస్తాడు. తర్వాత ఆ పాటనే తిరిగి పాడుతుండగా—

తెర]



చంద్రం : పొరపాటుగా చెయ్యడం లేదు రామన్నా! గ్రహపాటం మూలంగా అలవాటు చేసుకున్నారు.

విశ్వ : అలాగే వుండాలి. ఏపాటూలేకుంటే 'సాపాటు' కావడం కష్టంగా!

రామ : కూటి కోసం......?

విశ్వ : కోటి విద్యలోయ్.

చంద్రం : ఏం చేస్తారు రామన్నా? ఆదరాభిమానాలు లేక పోవడం వల్ల, తమ ప్రతిభను వచ్చిన విలువకు అమ్మి, దాని ప్రకృతిని......

విశ్వ : వికృతం చేస్తున్నారంటావ్!

చంద్రం : అంతేకాదు; ప్రకృతి సిద్ధంగా ప్రవహించే ప్రవాహానికి ఆనకట్ట కట్టి, డబ్బుకోసం ప్రక్కదారుల్ని త్రొక్కిస్తున్నారు.

విశ్వ : బాగుంది. ఏదో ఒకదారి తొక్కకపోతే బండినడచేది కష్టం.

రామ : మీరు చెప్పింది చాలా విచిత్రంగా వుంది. ఇలా ఎక్కడ జరుగుతుందంటారు బాబూ?

చంద్రం : ప్రస్తుతం యిటువంటివి ఎక్కువగా సినిమాలోకంలో జరుగుతున్నాయ్.

రామ : సినిమాల్లో పనిచేసే వాళ్ళకు కావలసినంత డబ్బు, గొప్ప పేరు వస్తుందట కదూ బాబూ?